# భారతీ నిరుక్తి

## (వేద స్వరూప దర్శనము)






రచన

హరి సోదరులు

నిరుక్తభారతీ గ్రంథమాల 1.
సాధన గ్రంథమండలి. 122



# భారతీ నిరుక్తి

(వేదస్వరూప దర్శనము)



రచయితలు :

హరి సోదరులు.



ప్రకాశకులు :

సాధన గ్రంథమండలి, తెనాలి.

ప్రథమ ముద్రణము :
విరోధకృత్ శ్రావణ పూర్ణిమ,
శుక్రవారము, 6 ఆగస్టు 1971.



రచయితలు :

హరి సోదరులు

సంస్కృత వాఙ్మయ పరిశోధనాలయము

శోధన్ గృహము
బందరురోడ్డు
విజయవాడ-2

శోధన్ గృహము
కొత్తపేట
తెనాలి.

మూల్యము : రు 15-00

ఎ. ఎస్. ఆర్. పవర్ ప్రెస్, తెనాలి.

# విషయ సూచిక :

## ఆమ్నాయః శ్రుతిః



## స్వాధ్యాయః



## స్వాహా

## స్వధా



## వషట్



## త్రయీ

## కవిః - కావ్యమ్

## భారతీ



## ఛందః

— o —

శ్రీః

# పీఠిక

వాచః చిదుద్గతాః ప్రాచః చిత్పరాః సుమహత్తరాః ।
తన్మాతరం చ ధీశుద్ధ్యై కలయేఽనన్యయా ధియా ॥

వేదము మానవాళికి మహోపకారక మగు అక్షయ్యనిధానము: సర్వార్థావభాసకము; సర్వార్థసాధకము; సర్వానర్థనివారకము; అనాదినిధనము; అపౌరుషేయము; స్వతః ప్రమాణము; విశిష్టానుపూర్వీవిలసితమై పరమపావనమైన శబ్దరాశి; చిత్స్వరూపు (జ్ఞప్తిమాత్రస్వరూపు) డగు పరమాత్మయొక్క ప్రథమావతారము; కాన తత్సమానకక్షమై సర్వజ్ఞకల్పము, పరమాత్మనుండి యభివ్యక్తమై తత్తత్త్వమును బ్రతిపాదించెడి దివ్యశబ్దరాశి, సృష్టికార్య నిర్వహణమున జగత్స్రష్టకు సహకారిణి యా వేదభారతియే. అట్టి వేదభారతి యొక్క స్వరూప స్వభావాది వివరణమే యీ భారతీ నిరుక్తి.

శివ శక్తి విష్ణ్వాది - ఈశ్వరకోటిచే విరచితము లయిన బహుముఖాగమ గ్రంథజాతము, మను పరాశరాది మహర్షిప్రణీతములయిన స్మృతులు, వ్యాస వాల్మీకాది ముని విరచిత పురాణేతిహాసాదిగ్రంథములు, తుదకు కాళిదాస భవభూతి ప్రముఖ మహాకవికృత కావ్యనాటకాదులు - ఇట్లు భారతీయవాఙ్మయ మంతయు వేదప్రామాణ్య ప్రాశస్త్యముల నుద్ఘోషించుచు తదర్థోపబృంహణార్థ మయియే ప్రవర్తించినది.

## వేదము నిత్యము

వేదమునకు గర్త లేడను విషయమును స్మృతికారులు మంటాపథముగ జెప్పినారు (పే. 2).

"న కశ్చి ద్వేదకర్తా చ వేదం స్మృత్వా చతుర్ముఖః ।
తథైవ ధర్మాన్ స్మరతి మనుః కల్పాంతరేఽన్తరే॥ - (పరా.స్మృ.)

" .... వేదకర్తృత్వ మాశంక్య నిరాచష్టే - న కశ్చి దితి। న తావత్ వేదవ్యాసో వేదకర్తా, విభాగమాత్రకారిత్వాత్, నాపి చతుర్ముఖః, ఈశ్వరేణ చతుర్ము

ఖాయ వేదప్రదానాత్; నాపి జగదీశ్వరః, తస్య వేదాభివ్యంజకత్వాత్। తదుక్తం మత్స్యపురాణే —'అస్య ధర్మస్య సర్వజ్ఞః కల్పాదౌ పరమేశ్వరః। వ్యంజకః కేవలం విప్రా నైవ కర్తా న సంశయః॥ బ్రహ్మాణం మునయః పూర్వం సృష్ట్వా తస్మై మహేశ్వరః। దత్తవానఖిలాన్ వేదాన్ విప్రా ఆత్మని సంస్థితాన్॥ బ్రహ్మణా చోదితో విష్ణుః వ్యాసరూపీ ద్విజోత్తమాః। హితాయ సర్వభూతానాం వేదభేదాన్ కరోతి సః॥' - ఇతి। ఇతరేషాం తత్కర్తృత్వం దూరాపాస్తమ్" — పరాశర మాధవీయమ్.

వేదమునకు గర్త లేదు. వేదవ్యాసుడు వేదవిభాగకర్తయే కాని వేదకర్త కాడు. ఈశ్వరునుండియే వేదముల గ్రహించువాడగుటచే చతుర్ముఖుడును వేదకర్త కాడు. ఈశ్వరుడును వేదాభివ్యంజకుడే కాని వేదకర్త కాడు. మత్స్యపురాణము నీ విషయమునే స్పష్టము చేయుచున్నది. ఈశ్వరాదులే వేదమునకు గర్తలు గాజాలనిచో నిక అల్పజ్ఞులగు మానవులు కర్తలు కాజాల రని వేఱుగ జెప్ప నక్కఱ లేదు - అని యర్థము.

వేదమునకు కర్త గలదా ? లేదా ? యను విషయమై పక్ష ప్రతిపక్షవాదముల విమర్శించి తుదకు లేదని పూర్వమీమాంసాశాస్త్రమునను నిర్ధారింపబడినది. కాఠకం, కాలాపం, కౌథుమం, తైత్తిరీయం-అనియెడి వేదశాఖలకు గల సమాఖ్యల బురస్కరించుకొని యా వేదశాఖ లా యా మునులచే రచింపబడి యుండు ననెడి వాదము ప్రత్యాఖ్యాతము గావింపబడినది. 'వ్యాసేన ప్రోక్తం వైయాసికం మహాభారతమ్' — అనునట్లుగా - 'కఠేన ప్రోక్తం కాఠకమ్' ఇత్యాది నిర్వచనముల జెప్పినను మహాభారతవిషయమున కర్తృప్రసిద్ధి యుండుటచే వ్యాసప్రోక్త మనగా వ్యాసరచిత మనియే యర్థము. వేదశాఖావిషయమై కర్తృప్రసిద్ధి యెచటను గానరానందున కఠప్రోక్త మనగా కఠమునిరచిత మని చెప్ప వలనుపడదు. కఠాదులు అధ్యయనాధ్యాపనాది సంప్రదాయముల ద్వారా తత్తచ్ఛాఖాప్రవర్తకు లగుటచే నాయా వేదశాఖలకు కాఠకాది సమాఖ్య లుపపన్నము లగును. మహాభారతాదుల వలె వేదముగూడ వాక్యరూపమే యగుటచే వేదము పౌరుషేయము ('వేదః పౌరుషేయః, వాక్యత్వాత్, మహాభారతాదివత్') — అనియెడి యనుమాన ప్రకారమును సరియైనది కాదు. అచటి హేతువు వ్యాప్యత్వాసిద్ధరూప మగు అసద్ధేతువు. అచట జన్యజ్ఞానమూలకత్వ

ముపాధి యగుటచే నాహేతువు సోపాధికము. కాన వాక్యత్వరూప హేతువుచే వేదవాక్యము పౌరుషేయమే యని నిరూపింప శక్యము కాదు. ఈ యంశము వేదాం శ్చైకే సన్నికర్షం పురుషాఖ్యాః .... .... .... కృతే చావినియోగః స్యాత్ కర్మణః సంబంధాత్ (జై. సూ. 1-1-27 నుండి 32) అను సూత్రములలో విచారించి నిర్ణయింపబడినది. ఈశ్వరస్యైవ గతకల్పీయ వేదప్రవచన కర్తృత్వోపపత్తేః వేదానాం నిత్యత్వ మితి భావః'—అని యనుచు భాట్టదీపికావ్యాఖ్య (భాట్టచింతామణి) యందు శ్రీ వాంఛేశ్వర యజ్వయు వేదనిత్యత్వమును సోపపత్తికముగ నిరూపించి నాడు. 'శివాద్యా ఋషిపర్యన్తాః స్మర్తారోఽస్య న కారకాః'—ఇత్యాది వచనములు నిందుకు ప్రమాణము.

ఉత్తర మీమాంసాశాస్త్రమునందు నీ విషయము విపులముగ చర్చించి వివరింప బడినది. 'అతః ప్రభవాత్; అత ఏవ చ నిత్యత్వమ్'—అనెడి వేదనిత్యత్వాపౌరు షేయత్వముల నిరూపించెడి దేవతాధికరణము నందలి బ్రహ్మసూత్రముల వ్యాఖ్యా నించుచు శ్రీ శంకరభగవత్పాదు లిట్లు వివరించిరి—

"అతఏవ నియతాకృతే ర్దేవాదే ర్జగతః వేదశబ్దప్రభవత్వాత్ వేదశబ్దనిత్యత్వ మపి ప్రత్యేతవ్యమ్ । తథాచ మంత్రవర్ణః - 'యజ్ఞేన వాచః పదవీయ మాయన్ తా మన్వవిందన్ ఋషిషు ప్రవిష్టామ్'— ఇతి స్థితా మేవ వాచ మనువిన్నాం దర్శయతి" — శం. భా.

పరమేశ్వరుని వలెనే వేదము గూడ నియతాకృతితో నొప్పు అగ్ని వాయు సూర్య చంద్రేంద్రాది సర్వజగతునకు హేతు వని నిరూపింపబడినది గాన వేదము నిత్యము. యజ్ఞేన వాచః - అనెడి మంత్రవర్ణము నీ విషయమును స్పష్టము జేయు చున్నది. యజ్ఞాది సత్కర్మ నిర్వాహకు లగు మహర్షులు యజ్ఞాది తపోఽనుష్ఠాన జన్య పూర్వజన్మ సుకృత పరిపాకమున ప్రలయకాలముననునశింపకయే నిలిచియున్న వేదవాక్కును బొందగలుగు యోగ్యతను సంపాదించుకొనినవారై యా వేదమును పొందగల్గిరి. ఋషుల బ్రవేశించిన యా వాక్కే లోకమున వ్యాప్తమై యజ్ఞాది కర్మ ప్రవర్తక మైనది — అని యర్థము (పే. 63). 'యుగాంతేఽన్తర్హితాన్ వేదాన్ సేతిహాసాన్ మహర్షయః । లేభిరే తపసా పూర్వ మనుజ్ఞాతాః స్వయంభువా'- ఇత్యాది స్మృతి వచనములును పై శ్రుత్యర్థమునే యనువదించుచున్న వనియు

శ్రీశంకర భగవత్పాదులు వివరించిరి, కాన వేదము నిత్యము, అపౌరుషేయము, పురుష గత దోషదూషితము కాదు, కాన ప్రమాణము — అని నిర్ధారింపబడినది.

వేదము సర్వార్థావభాసకము (సర్వజ్ఞానాకరము)

శాస్త్రయోనిత్వాత్ — అను బ్రహ్మసూత్రమును వ్యాఖ్యానించుచు శ్రీ శంకర భగవత్పాదులు ఋగాది వేద మాహాత్మ్యము నిట్లు వివరించిరి —

"మహతః ఋగ్వేదాదేః శాస్త్రస్య అనేక విద్యాస్థానోపబృంహితస్య ప్రదీప వత్ సర్వార్థావద్యోతినః సర్వజ్ఞకల్పస్య యోనిః కారణం బ్రహ్మ। న హీదృశస్య శాస్త్రస్య ఋగ్వేదాది లక్షణస్య సర్వజ్ఞగుణాన్వితస్య సర్వజ్ఞా దన్యతః సంభవోఽస్తి".

దీనికి పూర్వసూత్రమున సర్వజగత్సృష్టి స్థితి లయ కారణ మగున దేదియో యదియే జిజ్ఞాస్య మగు బ్రహ్మ యని ప్రతిపాదింపబడినది. ఆ సర్వకారణవస్తువు చేతనమా? లేక జడమా? యను సందియమును దొలగించుటకై 'శాస్త్రయోనిత్వాత్' - అను నీ సూత్ర మారంభింపబడినది. మహామహిమోపేత మయిన ఋగాదివేదరాశికిగూడ కారణము బ్రహ్మ యని సూత్రార్థము. సర్వార్థావ భాసక మగు వేదమునకుగూడ గారణ మగు వస్తువు చేతనము, సర్వజ్ఞము ననియే చెప్ప నగును గాని జడ మని యనుట పొసగదని సూత్రతాత్పర్యము. పై భాష్యము నందు 'మహతః, అనేక విద్యాస్థానోపబృంహితస్య; ప్రదీపవత్ సర్వార్థావద్యోతినః; సర్వజ్ఞకల్పస్య; శాస్త్రస్య' - ఇత్యాది విశేషణములతో ఋగాది వేదరాశి కీర్తింప బడినవి. ఈ విశేషణము లన్నియు సార్థకములు, వేదముయొక్క మహత్త్వ సర్వోత్కృష్టత్వముల ప్రఖ్యాపన జేయు నట్టివి. శ్రీరామానంద పూర్ణానందులు నా విశేషణవాచకపదముల సార్థకత నిట్లు వివరించిరి.

> "మహతః గ్రంథతః (శబ్దతః) అర్థత శ్చ మహత్త్వ మితి। శబ్దతః వేదోచ్చారణమాత్రేణ సర్వపాపక్షయా చ్ఛబ్దతో వేదరూపశాస్త్రస్య మహత్త్వ మితి। పురాణాది దశవిధ విద్యాస్థానేషు వేదార్థ ఏవ ప్రతిపాద్యతే। తస్మా దర్థతోఽపి వేదస్య మహత్త్వ మితి।"

శబ్దస్వరూపము చేతను, అర్థస్వరూపముచేతను వేదము మహత్త్వసంపన్నము; పూజ్యము; వేదశబ్దము నుచ్చరించిన మాత్రమున సర్వపాపములు శమించును; కాన

వేదశబ్దము మహత్త్వపూర్ణము. పురాణ - న్యాయ - మీమాంసా - ధర్మశాస్త్ర-శిక్షా-వ్యాకరణ-ఛందో-నిరుక్త-జ్యోతిష-కల్పము లనెడి యీ దశవిధ విద్యాస్థానముల యందును వేదార్థమే ప్రతిపాదింపబడుచున్నది గాన అర్థమును బట్టియు వేదము యొక్క మహత్త్వము స్పష్టము. పై భాష్యము నందలి 'అనేక విద్యాస్థానోప బృంహితస్య' - యనెడి విశేషణముగూడ నీ యర్థమునే వివరించుచున్నది. ఇట్లు చెప్పుటచే పురాణ న్యాయ మీమాంసాది విద్యాస్థాన ప్రవర్తకులగు వ్యాస, గౌతమ, జైమిని, మను, పాణిని, యాస్కాది మహాపురుషు లందఱును వేదముయొక్క మహత్త్వమును దర్శింపజేయుట కయియే ఆ యా విద్యాస్థానముల వెలయింప జేయుచు తదర్థవ్యాఖ్యాన తత్పరు లగుట సూచింపబడినది.

ప్రదీపవత్ సర్వార్థావద్యోతినః ___ అను పై శాంకరభాష్యమునందలి విశేషణము 'వేదము సర్వవిద్యాస్థాన ప్రమేయావబోధకము గాన ప్రమాణ శ్రేష్ఠము'- అని పైన జెప్పబడిన యర్థమును వివరించుచున్నది. చక్షురాదీంద్రియములు రూప శబ్దాదివిషయముల భాసింపజేయుచు నా యా విషయములగూర్చి యవియే ప్రమాణ ములుగ గ్రహింపబడుచున్నవి. అట్లే అతీంద్రియములు, సర్వపురుషార్థహేతువులు నగు ధర్మబ్రహ్మరూప మహార్థముల భాసింపజేయుటచే నా ధర్మబ్రహ్మవిషయమున వేదమే ప్రమాణ మని తెలియవలెను.

శాస్త్రస్య :- హితార్థశాసకము (ప్రతిపాదకము) గాన ఋగాది వేదరాశి శాస్త్రము-అని యర్థము. అందుచే హితార్థులగు నెల్లరచే నాదరింపబడదగినవి; తదుక్తార్థము లవశ్యానుష్ఠేయములు - అనియు సూచింపబడినది.

సర్వజ్ఞకల్పస్య - వేదము సర్వజ్ఞము. అనగా సర్వార్థావభాసక మని యర్థము. కావుననే 'అర్థతోఽపి మహతః' అనియు పూర్వము చెప్పబడినది. సర్వజ్ఞ మగు నిట్టి వస్తువు ప్రాదుర్భవింపవలయు ననిన తత్కారణవస్తువు గూడ సర్వజ్ఞము సర్వార్థావభాసకము నయి యుండవలెను. ఏలయన కారణమున లేని విశేషము తత్కార్యమున నెట్లు సంక్రమింపగలదు ? కాన కారణ మగు పరమేశ్వరుడు సర్వార్థావభాసకుడు గాన సర్వజ్ఞుడు. అట్లే సర్వవిద్యాస్థాన సర్వప్రమేయావభాసకముగాన వేదముకూడ సర్వజ్ఞ మని చెప్పవలెను.

ఇట్లు చెప్పుచో సర్వార్థావభాసక వస్తువులు రెండు. అవి వేదము; పరమేశ్వరుడును - అని సిద్ధించినది. ఇదెట్లు సంభవమగును? సర్వార్థావభాసక వస్తువులు రెండు ఉండునా? - యనెడి యాశంక గలుగుట సహజము. ఈశ్వరుడు సర్వార్థావభాసకు డనగా సర్వార్థప్రకాశన మనెడి కార్యమునకు ఈశ్వరుడు కర్త. వేదము కరణము (సాధనము). కార్యసాధనమునకై, తత్కార్యనిర్వహణ సమర్థు డగు కర్త, అట్టి సాధనము-రెండును నపేక్షితములే గదా! కాన దోషము లేదు. కార్యసాధనమున కర్త స్వతంత్రుడు, సాధనము కర్తృపరతంత్రము. కావుననే ఈశ్వరుడు సర్వజ్ఞుడు, వేదము సర్వజ్ఞకల్పము నని చెప్పబడినది. అనగా వేదము సర్వజ్ఞు డగు పరమేశ్వరునికంటె కొంచెము తక్కువ, తత్సదృశము నని భావము. మఱియు పరమేశ్వరుడు సర్వప్రకాశకుడు, చిత్స్వరూపుడు. వేదము సర్వార్థావభాసక మయ్యును శబ్దరూపము గాన జడము. అందుచేగూడ వేదము సర్వజ్ఞకల్పము. ఇంతే కాదు. వేదము సర్వార్థప్రత్యయసంపాదకము, సర్వజ్ఞ సర్వేశ్వర పరమాత్మ తత్త్వ ప్రతిపాదకము గాన సర్వార్థావభాసకము, సర్వజ్ఞము నని చెప్పదగి యున్నను ప్రతిపాదకముకంటె ప్రతిపాద్యము ప్రధానము; అందుచేతను వేదము సర్వజ్ఞకల్ప మని భాష్యకారులు వర్ణించిరి. వేదము సర్వజ్ఞ పరమాత్మసదృశము అని భావము. (పే. 47).

విచారించి చూడ పరమాత్మకు గల యీ సర్వార్థప్రకాశ కర్తృత్వము గూడ నౌపచారికమే గాని యథార్థము కాదనియు దెలియును. పరమాత్మ చిన్మాత్ర స్వభావకము. తత్సత్తామాత్రము చేతనే - తత్సంబద్ధమై - దానియందధ్యస్తమై - యున్న సర్వమును భాసించును. అది దేనిని భాసింప జేయదు. అది సర్వ విక్రియా విరహితము. కాన పరమాత్మ సర్వార్థప్రకాశనకర్త యని చెప్పుట యౌపచారికమే గాని ముఖ్యము గాదు. వేదము నిర్వికార సర్వసాక్షి సర్వజ్ఞప్రభవము, కాన నిర్దోషము, సర్వార్థావభాసన సాధనము; ప్రమాణతమము. కావుననే భాష్యకారులును 'సర్వజ్ఞ గుణాన్వితస్య' యను విశేషణముచే వేదము యొక్క మహత్త్వమును విశదీకరించిరి.

'న హీదృశస్య శాస్త్రస్య ఋగ్వేదాదిలక్షణస్య సర్వజ్ఞగుణాన్వితస్య సర్వజ్ఞాదన్యతః సంభవోఽస్తి' — అను పూర్వోదాహృత శాంకరభాష్య వచనము వలన —

'సర్వజ్ఞ సర్వసాక్షి సర్వప్రకాశక పరమేశ్వర వస్తువు నుండి వేదములకు సంభవము —పుట్టుక - గల్గిన దని తెలియును. అట్లు సంభవించుచో వేదము కార్యమై యనిత్యమే యగును. అది నిత్యము, అపౌరుషేయ మని యనుట యెట్లు పొసగును? — అను సందియమును దొలగించుచు శ్రుతియే యిట్లు చెప్పుచున్నది.

"అస్య మహతో భూతస్య నిఃశ్వసిత మేత ద్యదృగ్వేదః— —"

ఇందలి 'నిఃశ్వసిత' పదమును శ్రీ శంకరులును, తద్భాష్యవ్యాఖ్యాతలు నిట్లు వివరించిరి.

"అప్రయత్నే నైవ లీలాన్యాయేన పురుషనిఃశ్వాసవత్" —శం.భా.

"వేదస్య పౌరుషేయత్వ శంకా నిరాసార్థం శ్రుతిస్థ నిఃశ్వసిత పదార్థ మాహ-అప్రయత్నేనేతి" —రత్నప్రభా.

ఎట్టి ప్రయత్న లేశముగాని ఆయాసముగాని లేకయే ఉన్మేష నిమేషములను, ఉచ్ఛ్వాస నిఃశ్వాసములను పురుషు డెట్లు చేయుచున్నాడో యట్లే పరమేశ్వరుడు నెట్టి ప్రయత్నము లేకయే యనేక శాఖావిశేష విలసితమై మహత్తరమైన యా వేదరాశిని లీలగా ప్రవర్తింపజేసెను —అని యర్థము. 'అర్థం బుద్ధ్వా శబ్దరచనా'—యని లోక సంప్రదాయము. ప్రత్యక్షాది ప్రమాణాంతరములచే ముందుగ నొక యర్థమును దెలిసికొని, యా యర్థము నభివ్యక్తము జేయగల శబ్దముల గూర్చి యాలోచించి, నిశ్చయించి, తదనుగుణముగ వాక్యాది నిర్మాణ రూప రచనము చేయుట లోకసిద్ధము. ఇట్టి ప్రయత్నము గాని, ఆయాసముగాని లేకయే పరమేశ్వరుడు లీలగా వేదముల ప్రవర్తింప జేసెనని భావము. కాన నర్థజ్ఞానపూర్వక వాక్య నిర్మాణరూప యత్నము, అనగా వేదరచయితృత్వము పరమేశ్వరునకు లేదు. ఇట్లు వేదము పౌరుషేయము కానందున నిత్య మగును.

పరమేశ్వరునకు గల వేదరచయితృత్వము అర్థజ్ఞానపూర్వక వాక్యనిర్మాణాత్మకము కాదనినచో శాస్త్రయోనిత్వము - వేదకారణత్వము - పరమేశ్వరున కెట్లుపపన్న మగును? - అని యనరాదు. "యథా అధ్యేతారః (ఉపాధ్యాయినః) పూర్వ క్రమం జ్ఞాత్వా (పూర్వవేదానుపూర్వీం స్మృత్వా) వేదం కుర్వన్తి (వేదక్రమానుసారేణ శిష్యాన్ ప్రతిబోధయన్తి) తథా విచిత్రగుణ మాయాసహాయః అనావృతానంత

స్వప్రకాశ చిన్మాత్రః స్వకృత పూర్వ కల్పీయక్రమ సజాతీయ క్రమవంతం వేదరాశిం తదర్థాం శ్చ యుగపత్ జాన న్నేవ కరోతీతి న వేదస్య పౌరుషేయతా । యత్ర హి అర్థజ్ఞానపూర్వకం వాక్యజ్ఞానం వాక్యసృష్టౌ కారణం తత్ర పౌరుషేయతా; అత్ర చ యౌగపద్యా న్న సా"—అర్థజ్ఞానపూర్వక వాక్యరచన యెచట జరుగునో యావాక్యము లేక గ్రంథము పౌరుషేయము. అట్టి వాక్యరచన లేనియపు డది పౌరుషేయము కానేరదు. అద్వైతులు తమ గురువుల నుండి తా మెట్టి క్రమము (అనుపూర్వి) తో వేదమును గ్రహించిరో యా క్రమముననే వేదమును స్మరించి, తిరిగి యా క్రమముననే విలసిల్లు వేదరాశిని తమ శిష్యుల కుపదేశింతురు. అంతియే కాని వారు ముందుగ వేదవాక్యముల యర్థము గ్రహించి తదర్థావబోధన క్షమములగు విలక్షణానుపూర్వీ విలసిత వేదవాక్యముల రచించి యుపదేశింపరు. అట్లే పరమేశ్వరుడును. ప్రలయకాలమున శబ్దార్థాత్మక మగు సర్వప్రపంచము సర్వకారణ మగు మాయయందు లీన మయియుండును. చిత్ర విచిత్ర గుణసంపన్న మగు మాయాశక్తి పరమేశ్వరున కుపాధి. పరమేశ్వరుడు అనావృతానంత స్వప్రకాశ చిన్మాత్ర స్వరూపుడు. కాన స్వోపాధి యగు మాయయందు లీనమై యుండెడి సర్వార్థములను తాను యుగపద్ అనగా నొక్కసారిగ ప్రకాశింప జేయుచు; తెలిసికొనును; మఱియు పూర్వకల్పమున దా నెట్టిక్రమమున వేదము నభివ్యక్తము గావించి యుండెనో ఆ యానుపూర్వితోడనే విలసిల్లెడి యా వేదరాశినే మరల మరల ప్రతికల్పాదియందు నభివ్యక్తము జేయుచుండును. వేదశబ్దార్థముల యొక్క స్ఫురణము (ప్రకాశము) ఏకకాలమునందే పరమేశ్వరునకు గల్గుటచే వేదవాక్యప్రకాశనమునకు బూర్వము తద్రచనాప్రయోజక మగు నర్థజ్ఞానమును సాధనాంతరముచే సంపాదించుకొనుట గాని, తదనుగుణముగ వాక్యముల, రచించుటగాని వేదవిషయమున లేదని స్పష్టమైనది. కనుక వేద మపౌరుషేయ మని సిద్ధించినది. సూతసంహితయు నీ విషయము నిట్లు వ్యక్తము జేయుచున్నది.

"వేదోఽనాదిః శివ స్తస్య వ్యంజకః పరమార్థతః ।
అభివ్యక్తి మపేక్ష్యైవ ప్రణేతే త్యుచ్యతే శివః ॥"

— యజ్ఞవైభవఖండ.

"పరమార్థత స్తు వేదః అనాదిః అవిరహితః నిత్యః శివ స్తు తస్యాభివ్యంజకః న తు స్వబుద్ధ్యా రచయితా। యథావస్థితాభివ్యంజకత్వ మపేక్ష్యైవ వేదస్య ప్రణేతేత్యపి

వ్యవహారః। అతఏవోక్తం - 'కర్తాపి బ్రహ్మా వేదస్య న పూర్వక్రమతోఽన్యతః। క్రమం కరోతి వాగ్వజ్రపాతో మాభూ న్నృణా మితి" - మాధవాచార్యః.

వేదము నిత్యము: ఆది లేనిది; పరమేశ్వరుడు దాని నభివ్యక్తము జేసెనే కాని స్వబుద్ధితో రచింపలేదు. అట్లభివ్యక్తముజేసిన కారణముననే పరమేశ్వరునకు వేదకర్త యని వ్యవహారము. పరబ్రహ్మ వేదమునకు కర్తయే యైనను పూర్వకల్పీయ క్రమభిన్న క్రమముతో వేదమును సృష్టింపడు. ఏలయన వేదము నందలి స్వర వర్ణ మాత్రాదులలో నే కొంచెము విపర్యాసము సంభవించినను తదధ్యేతలకు స్వరాదివైకల్యముతో గూడిన వేదవాక్యములు వజ్రాయుధప్రహార సమానములై యనర్థదాయకములు కాగలవు. అధ్యేతల కట్టి యనర్థము వాటిల్లకుండుటకై పరమేశ్వరుడు క్రమభంగము నొనర్పడు. పూర్వ కల్పీయ క్రమవిలసితమైన వేదమునే ప్రకాశింప జేయుచుండును. కనుక పరమేశ్వరుని యొక్క శాస్త్రయోనిత్వ ముపపన్నమే యగును. దేవతాధికరణమున గూడ శంకరభగవత్పాదులు "అనాదినిధనా నిత్యా వా గుత్సృష్టా స్వయంభువా। ఆదౌ వేదమయీ నిత్యా యతః సర్వాః ప్రవృత్తయః'—అను వేదవ్యాస వచనమును వ్యాఖ్యానించుచు నీ విషయము నిట్లు వివరించిరి.

"ఉత్సృష్టా - ఉత్సర్గోఽప్యయం వాచః సంప్రదాయప్రవర్తనాత్మకో ద్రష్టవ్యః" —శం.భా.

వేదసంప్రదాయ ప్రవర్తకుడే గాని ఈశ్వరుడు వేదకర్త కాడని యర్థము. 'యో బ్రహ్మాణం విదధాతి'. యను శ్రుతి 'పరమేశ్వరుడు సృష్ట్యాది యందు బ్రహ్మను సృజించి యాతని హృదయమున వేదముల ప్రకాశింపజేసె' నని జెప్పుచున్నది. జగత్సృష్టికిని తత్స్రష్ట యగు ప్రజాపతికి గూడ బూర్వమే వేదములు గలవని శ్రుతియే స్వయముగ జెప్పికొనుట గమనార్హము. ఇట్లు జగత్సృష్టికిని, సృష్టికర్తకును బూర్వమే విలసిల్లెడి వేదము పౌరుషేయ మెట్లగును? ఇట్లు వేదము సర్వసృష్టిహేతువు, సర్వార్థావధానకము, పరమాత్మ సమకక్షమై సర్వజ్ఞకల్పము నని నిరూపింపబడుటచే వేదము సర్వార్థసాధకము, పురుషబుద్ధిగత దోషదూషితము గాక యపౌరుషేయము నని స్పష్టమైనది.

## విజ్ఞాన వికాసక్రమము – సంప్రదాయదృష్టి; చారిత్రక దృష్టి

భారతీయ వాఙ్మయ మంతయు వేదరాశి నపౌరుషేయము, సర్వార్థవద్యోతకము, ప్రమాణతమము, దివ్యము, పరమపావనము నని కీర్తించుచుండ, అనాఘ్రాతార్షగంధ హృదయులు, యజ్ఞ దాన తపోఽనుష్ఠానాసంస్కృతాంతఃకరణులు నగు అధునాతనులు కొందఱు. స్వప్రతిభోన్నీత యుక్త్యాభాసమాత్రావష్టంభముతో ననన్యలభ్యములు వేదైకసమధిగమ్యములు నగు ధర్మబ్రహ్మ వస్తువుల విషయమున గాని, వేదస్వరూప స్వభావవిషయమున గాని సాక్షాత్కృతధర్ములైన మహర్షుల యొక్కయు, తపః సమాసాదితాలౌకికాపూర్వ ఋతంభరాది ప్రజ్ఞాసంపన్నులైన మహాత్ముల యొక్కయు నిర్ణయముల పట్ల నాశ్వాసము లేనివారై ఏమేమో దోషముల నారోపించి యాక్షేపించుచు చరిత్ర కల్పనల జేయుట కారంభించిరి. కలిపురుష మాహాత్మ్య మిట్టిది గదా! (యత్ర స్వప్రతిభా మానం తస్మై శ్రీ కలయే నమః).

ఐహికాముష్మిక ఫలప్రాప్తి మొదలు మోక్షము వరకు గల సమస్త పురుషార్థముల బోధించుట కయియే వేదము ప్రవృత్తమైనది; వేదోక్తార్థమును స్ఫుటముగ నభివ్యక్తము జేయుట కయియే వేదాంతములు ప్రవృత్తమైనట్లు నిరుక్తశాస్త్రము చెప్పుచున్నది. 'సర్వకామ ప్రాప్త్యాదిః మోక్షాంతః పురుషార్థో వక్తవ్య ఇతి వేదః ప్రవృత్తః । తత్పరిజ్ఞానాయ వేదాంగాని ప్రవృత్తాని' — ఇది మన యార్షదృష్టి. ఈ దృష్టితోనే మన పరిశీలన జరుగును. అట్లుగాక పాశ్చాత్యపండితులు, తదనుయాయులును ప్రకృతి ప్రాకృత పదార్థవర్ణనపరమే వేద మను దృష్టితో పరిశీలింప నారంభించిరి.

ఆర్షదృష్టి ననుసరించి ప్రతిపదార్థము భౌతికము (జడాంశము), దైవతము (చిదంశము) అను రెండంశములతో ననుబంధించి యుండును.

> "అస్తి హి ఐశ్వర్యయోగా ద్దేవతానాం.........మృదాదిష్వపి చేతనా అధిష్ఠాతారోఽభ్యుపగమ్యన్తే । మృ దబ్రవీ దాపోఽబ్రువన్ ఇత్యాది దర్శనాత్" — శం.భా. (దేవతాధికరణమ్).

> "యదుక్త మాదిత్యాదయో మృదాదివ దచేతనా ఏవేతి, తన్న। సర్వత్ర జడాఽజడాంశద్వయ సత్త్వాత్" —రత్నప్రభా.

ప్రకృతి పరమాత్మల సంబంధమువలననే సృష్టి ప్రవర్తిల్లు నని సంప్రదాయము. గాన జగత్తునందలి యన్నివస్తువులయందును పరమాత్మాంశము (చైతన్యాంశము), ప్రకృత్యంశము (జడాంశము) - ఈరెండు ననుగతము లయి యుండు ననుట యుపపన్నమే యగును. కారణధర్మములు కార్యములయందు ప్రకాశించుచుండుట యనునది ప్రసిద్ధమేగదా! ఈ తత్త్వమును గుర్తించి ప్రతి పదార్థమునందలి భౌతికాంశమును వదలి(ఉదాసీనభావముతో బరిత్యజించి) చిదంశమాత్రావబద్ధ బుద్ధులయి 'సర్వం విష్ణుమయం జగత్, సర్వం ఖల్విదం బ్రహ్మ' - అను సిద్ధాంతముల సారము నధిగమించుట శ్రుతిసంప్రదాయము.

చారిత్రికు లిట్టి యీ తత్త్వము నెఱుగరు. కేవలచరిత్ర కల్పనాలక్ష్యముతో వేదపరిశీలనము గావించిరి. వారు చెప్పెడి సృష్టిక్రమ పద్ధతి వేఱు. శ్రుతి సంప్రదాయము వేఱు. ఈ విషయమై శ్రుతిసంప్రదాయానుగతమైన యార్షదృష్టి యెట్లున్నదో చూతము.

చిన్మాత్రస్వభావ మగు పరతత్త్వమునుండి యా పరమాత్మకు తమోరూపము, అవిద్యాలక్షణము, ఆవరణస్వభావము నగు మాయ (ప్రకృతి) యొక్క యనుబంధ మేర్పడి సృష్టి ప్రారంభ మగును. 'మయాధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్' - అనుచు గీతాశాస్త్రము నీ విషయము స్పష్టము జేయుచున్నది. పరతత్త్వము సంపూర్ణము, నిర్వికారము. ఆ పరతత్త్వముతో ప్రకృతి యెంతెంత సాంద్ర భావముతో ననుబంధించుచుండునో యంతంతగా సృష్టి విస్తరించుచుండును. అనగా విజ్ఞానము (పరతత్త్వము) అవిద్యచే నుత్తరోత్తర సాంద్రభావముతో ననుబంధించు చుండ (ఆవరింపబడుచుండ) తదనుగుణముగ నుత్తరోత్తరసృష్టి యేర్పడుచు విస్తరించుచుండు నని భావము. దీని ననుసరించి, అనగా నార్షదృష్టి ననుసరించి, సృష్టిక్రమవికాస మిట్లు గాంచనగును.

చిన్మాత్రస్వరూపు డగు పరమాత్మ మొదట బ్రహ్మను సృజించెను. అపుడు మాయ (ప్రకృతి) సామాన్యరూపమున విలసిల్లుచు స్వాశ్రయ పరతత్త్వమును విశేష ముగ నావరింప లేకపోవుటచే నపు డేర్పడిన సృష్టి (బ్రహ్మ) జ్ఞానఘన మైనది. కాననే పరతత్త్వప్రతిపాదకమై తదాత్మకమే యయిన వేదరాశి యా బ్రహ్మయొక్క

హృదయమున సంపూర్ణముగ నవభాసించెను. 'యో బ్రహ్మాణం విదధాతి' యను శ్రుతి యీ విషయమును దెలియజేయుచున్నది. ఇటు సృజింపబడిన బ్రహ్మకు అవిద్యావృతి యల్పీయము గనుక పరమాత్మ యాతని హృదయమున వేదముల భాసింపజేసె నని తాత్పర్యము. పిమ్మట నా బ్రహ్మ మానససృష్టితో తన సృష్టి నారంభించెను. మానససృష్టిలోనివారే వసిష్ఠాది మహర్షులు. బ్రహ్మకు వలె వీరికి వేదములు హృదయమున స్వయముగ భాసింపలేదు. బ్రహ్మ యనుజ్ఞచే తప మాచరించి వీరు వేదముల బొందగల్గిరి. 'యుగాంతేఽన్తర్హితాన్ వేదాన్ సేతిహాసాన్ మహర్షయః । లేభిరే తపసా పూర్వ మనుజ్ఞాతాః స్వయంభువా ॥' అను వేదవ్యాసవచన మీ విషయమును స్పష్టము చేయుచున్నది. ఇట గమనింపవలసిన యంశము గలదు. సృష్టిసమయమున బ్రహ్మకు అవిద్య యల్పతమముగ నుండుటచే నాతని హృదయము స్వచ్ఛతమము. కాన ప్రయత్నము లేకయే పరమేశ్వరానుగ్రహమున నాతనిహృదయమున వేదములు భాసించినవి. తరువాతి సృష్టిలోని వారు మహర్షులు. అవిద్య వారిలో కించిత్సాంద్రభావము నందినది. వారి యంతఃకరణములు బ్రహ్మకువలె స్వచ్ఛతమములు కాకపోయెను, అందుచే వేదప్రాప్తికయి వారు శ్రమించి తపమొనరింప వలసివచ్చెను. నియమపూర్వక తపోఽనుష్ఠానాదులచే (సంయమాదులచే) వారిహృదయముల నావరించిన యవిద్య తొలగగా వారు వేదముల దర్శింపగల్గిరి. పిమ్మట అవిద్య క్రమముగ సాంద్రభావము నొందుకొలదియు నుత్తరోత్తర సృష్టి యుత్తరోత్తరము స్థూలభావము నొంది తమోబహుళమగుచు బ్రవర్తిల్లినది. మానస సృష్టి యనంతరము క్రమముగ దేవతలు, మానవులు మొదలగు సృష్టి ప్రవర్తిల్లినట్లు శ్రుతి స్మృతి పురాణముల వలన దెలియును. ఋషులయందును, దేవతల యందును కంటె సాధారణ మానవులయందలి బుద్ధి సాంద్రతరాజ్ఞానావృతము. కావున వారికి విశేషతర ప్రయత్నమునగాని హృదయములు పరిశుద్ధములు గానేరవు. అంతఃకరణశుద్ధి లేక వేదములును, తత్త్వములును భాసింపవు. అంతఃకరణశుద్ధి కయియే బ్రహ్మచర్యాది వివిధనియమములు విధింపబడినవి. ఆ నియమములకు తపస్సని పేరు (‘నియమేషు తపశ్శబ్దః’ ఆప. ధర్మ. సూ.) ‘యజ్ఞేన వాచః పదవీయమాయన్’ అను మంత్రవర్ణ మీ యర్థమునే ప్రతిపాదించుచున్నది. వేదముల దర్శింపజాలిన మహర్షు లర్వాచీన నరులలో జన్మింప రనుచు నాపస్తంబు డిట్లు చెప్పుచున్నాడు.

'తస్మా దృషయోఽవరేషు న జాయన్తే, నియమాతిక్రమాత్ ।'

అర్వాచీనులయందు (మంత్రదర్శనసామర్థ్యముగల) ఋషులు జన్మించుటలేదు. అనగా లేరని యర్థము. అవశ్యాచరణీయములైన ధర్మములను నియమములను వీరతిక్రమించుటయే యిందుకు గారణము—అని యర్థము. ఇట్లు జూచుచో గ్రమక్రమముగ సృష్టిలో హృదయపారిశుద్ధ్యము తగ్గి, జ్ఞానప్రకాశము తఱుగుటయు, మానవులకంటె నుత్కృష్టులగు దేవతలయందును, వారికంటె నుత్కృష్టులగు మానససృష్టిలోని మహర్షులయందును, ఆపైన బ్రహ్మయందును జ్ఞానప్రకాశాధిక్య ముండుటయు దెలియనగును.

మొదట నత్యన్తసూక్ష్మము సర్వవ్యాపకమునగు ఆకాశముయొక్క సృష్టియు క్రమముగ నుత్తరోత్తరము సూక్ష్మత్వము వ్యాపకత్వము తగ్గి స్థూలములు వ్యాప్యములు నగు వాయు తేజో జల పృథివ్యాది భూతముల సృష్టి విస్తరిల్లినట్లె మొదట జ్ఞానప్రకాశాధిక్యము గల్గిన సృష్టియు రానురాను జ్ఞానప్రకాశము సన్నగిలి సాంద్రతర - అజ్ఞానావరణాధిక్యము గల్గిన సృష్టియు విస్తరిల్లిన దనుట శ్రుతి స్మృతి సంప్రదాయము.

చారిత్రికు లట్లుగాక 'మొదట సాంద్రతమ మగు నజ్ఞానముతో (జడమగు పదార్థజాతముతో) సృష్టి యుపక్రాంతమై క్రమక్రమముగ విజ్ఞానము వికసించి వికసించి మానవసృష్టి యయ్యెను. అదియే విజ్ఞానవికాసమునకు పరాకాష్ఠ —అని చెప్పుదురు. ఇది శ్రుతి స్మృతి సంప్రదాయానుగుణము కాదనుట పై వివరణము వలన స్పష్ట మగును. కాన హృదయవికాసము కొఱకై మానవులు తపోధర్మానుష్ఠాన తత్పరులై చిత్తము నావరించియుండెడి మాలిన్యమును (అవిద్యను) క్రమముగ తొలగించుకొని వేదతత్త్వముల దర్శింపవలె నని మనవారి యాశయము.

మఱియు దేవతలను గూర్చి చారిత్రికులదృష్టి వేఱు. కన్నులకు గానవచ్చు సూర్య చంద్రాది జ్యోతిస్సులే దేవతలని వేదరచయితలు భ్రమించి రని వారందురు. అది యుక్తము కాదు. "అగ్నేర్ ఋగ్వేదః" ఇత్యాది శ్రుతివాక్యములు అగ్ని-వాయు-ఆదిత్యులనుండి ఋక్ యజుస్ సామవిర్భావమును జెప్పుచున్నవి.

అగ్న్యాదు లనగా జడము లగు జ్యోతిస్సులే యగుచో వానినుండి యర్థావభాసక వాక్యరూప వేదావిర్భావ మెట్లు పొసగును? "అగ్ని రస్మి జన్మనా జాతవేదాః" ఇత్యాది మంత్రములతో "నేను జన్మతః జాతవేదు డగు అగ్నిని" అని యజమానుడు చెప్పికొనును. (పే. 20) చేతనుడగు యజమానుడు జన్మతః జడాగ్నిస్వరూపు డగుట యెట్లు? "యా మృషయో మంత్రకృతః" ఇత్యాది మంత్రములు దేవతలు తపస్సు జేసి వేదములు దర్శించి నట్లు చెప్పుచున్నవి (పే. 60). జడములగు జ్యోతిస్సులే దేవత లగుచో నవి తపస్సు జేయుట గాని వేదముల దర్శించుట గాని యెట్లు? అట్లుగాక యా దేవత లుత్కృష్టజన్ములని యంగీకరించినను వారు తమ కంటె నికృష్టవీర్య లగు మానవులయొక్క రచన అని చెప్పబడు వేదములకొఱకై శ్రమించి తపించు టేమి? అగ్న్యాదుల నధిష్ఠించి యున్న చైతన్యాంశములే దేవతలు, కేవల భౌతికజ్యోతిస్సులు కాదనుట శ్రుతిసంమతము.

భూలోకము కంటె నుత్తరోత్తరము దేవాది లోకము లనేకములు గలవు. అందు దేవాదిప్రాణివర్గము కలదు. ఈ లోకములలో నధోఽధోలోకముల కంటె నుత్తరోత్తరలోకము లుత్కృష్ట తేజస్సంపన్నములు. అటులే తత్రస్థ మగు ప్రాణి వర్గము ఉత్కృష్టోత్కృష్ట ధర్మ తపో బల వీర్య విజ్ఞాన సంపన్నమై యుపాస్యము. అట్టి దేవాది వర్గమును సేవించుట మానవుని యుత్కృష్టతాప్రాప్తికి హేతువు. ఉపాస్యదేవతా స్వరూప - తత్త్వములను, దేవతలకు గూడ నుపాస్యులగు దేవతల స్వరూపాదికము, భూత, భౌతిక జడ పదార్థములకును, మానవులకును నే యే దేవతలతో నెట్టి యనుబంధము గలదో యెట్టి యుపాసనలచే మానవులు భూతజయమును గూడ సాధింపగలరో, మఱియు నుత్తరోత్తరము దేవాదిరూపమగు నుత్కృష్ట జన్మల నంది తుదకు జ్ఞానఘనులై బ్రహ్మాత్మమున నెట్లు విలసిల్ల గలరో యట్టి అతీంద్రియము, గహనము నగు మార్గముల నుపదేశించుట కయియే వేదరాశి యవతరించినది.

మానవుల యందలి యజ్ఞానానుబంధము వేదవాక్య గత త్రివిధార్థ పరిశీలనాదుల వలన గాని తొలగదు. ఈ విషయమును గూర్చి నిరుక్తశాస్త్ర మిట్లు వివరించు చున్నది.

"అతో హ్యధ్యాత్మాధిదైవాధియజ్ఞాభిధాయినాం మంత్రాణా మర్థాః పరిజ్ఞాయన్తే । తే చ పరిజ్ఞాతా స్సన్తః పురుష స్యోత్తమాయ శ్రేయసే భవన్తి".

మంత్రముల యందు ప్రతిపాదింపబడెడి అధ్యాత్మాధిదైవాధియజ్ఞార్థము లీ నిరుక్తశాస్త్రము వలన దెలియబడును. ఆ యర్థముల బక్కగ దెలియుచో బురుషుల కుత్తమ శ్రేయస్సు సిద్ధించును. "యాజ్ఞం దైవత మాధ్యాత్మ మితి వాచః సమస్తోఽర్థః" వాక్కుయొక్క సంపూర్ణార్థము అధియజ్ఞ - అధిదైవ - అధ్యాత్మరూపము. ఈ త్రివిధార్థముల బరిశీలించిన గాని వేదవాక్యము యొక్క సంపూర్ణార్థము గ్రహింప బడ దని యర్థము. ఇట్లు యజ్ఞానుబంధముతో దేవానుబంధముతో ఆత్మానుబంధము తో మంత్రముల యర్థము బరిశీలింప వలెను. అట్టి యర్థముల మానవాళి కందించి యుత్తమశ్రేయస్సును సిద్ధింపజేయుట కయియే కృత్స్న వేదరాశి ప్రవృత్తమైనది. ఇట్లే అగ్న్యాధానమున పఠింపబడెడు మంత్రమును జూడుడు.

"మానుషా ద్దైవ్య ముపైమి"

మానుషత్వమునుండి దేవత్వము నందుచున్నాను—అని యర్థము. అగ్న్యాధానాది కర్మానుష్ఠానముద్వారా దేవతల నారాధించి తాద్భావ్యముచే దేవత్వము నందు నని తాత్పర్యము. నిరుక్తము నీ విషయము నిట్లు చెప్పుచున్నది.

"యాం యాం దేవతాం నిరాహ తస్యా స్తస్యా స్తాద్భావ్య మనుభవతి"

ఏ యే దేవతను గూర్చి నిఃశేషముగ దెలిసికొనుచున్నాడో యత డా దేవతాభావము నొందుచున్నాడు—అని యర్థము. మానవులు దేవతాభావము నొందుటయే గాదు; ఆ దశనుండి వేదముల సాయముననే తమ యజ్ఞానముల దొలగించుకొని ప్రజాపతి భావము, హిరణ్యగర్భభావమును గూడ పొందవలెను. అపుడును వేదము విరత వ్యాపారము కాదు. తత్పరిజ్ఞానముననే తుదకు వారు బ్రహ్మభావము నొందగలరు. ఇట్లు మానవులు బ్రహ్మభావము నొందుటకు నుపకారక మగుచు దేశికుని వలెను, చెలికానివలెను, సఖివలెను వెంటనంటియుండి పరమశ్రేయస్సును సమకూర్చును (పే. 420). ఇట్టిదియే వేద మని భారతీయాశయము.

కాని పాశ్చాత్యచరిత్రకారులును తదనుయాయులును నీ తీరుగ వేదవాక్యార్థ విచారము చేయ లేదు. వేదములు ఆదిమనివాసుల రచనలు; వారు ప్రకృతి దృశ్యములను సూర్యాది జ్యోతిస్సులను జూచి భ్రమించి వర్ణించిరి. క్రమముగ ఆరణ్యకోపనిషద్భాగ రచనాకాలము నాటికి దేవతాది విజ్ఞానవిషయమున క్రమవికాసము కలిగినది-యని యందురు. వేదము లట్టివే యగుచో నట్టివేదముయొక్క జ్ఞానము దేవభావము నొందుటకు గాని, తుదకు బ్రహ్మభావము నందుటకుగాని యుపకరించునవి గాదు గదా! అట్టి వేదపరిజ్ఞానముచే గల్గెడి ప్రయోజన మేమి? లేదనుచో 'మానుషా ద్దైవ్యముపైమి.' 'య ఇత్ తద్విదు స్త ఇమే సమాసతే"; "త మేవం విద్వా నమృత ఇహ భవతి। నాన్యః పన్థా అయనాయ విద్యతే'; యః పావమానీ రధ్యేతి ఋషిభిః సంభృతం రసమ్। తస్మై సరస్వతీ దుహే క్షీరం సర్పి ర్మధూదకమ్', బ్రహ్మవిదాప్నోతి పరమ్' — మున్నగు వేదాధ్యయన - తదుక్త కర్మానుష్ఠానాదులచే నుత్తమప్రయోజనములు సిద్ధించు నని యుపదేశించెడి శ్రుతివాక్యములకు సంగతి యెట్లు? అవి నిరర్థకములు నిష్ప్రయోజనము లనుటయు శ్రుతిసమ్మతము కాదు. 'ఇత్యధ్యాత్మమ్, ఇత్యధిదైవతమ్'-అనుచు శ్రుతులే ఆధ్యాత్మికాధిదైవికాద్యర్థముల శ్రుతివాక్యములందు దర్శింపవలె నని స్పష్టముగ జెప్పుచుండ నది కాదనుట ప్రత్యక్షాపలాపమే కాదా? ప్రకృతిదృశ్యాది వర్ణనపరములే యనుచో వేదములు అధిగతార్థబోధకములే యగును. అట్టిచో నవి యనువాదకములే యగును, ప్రమాణము లన దగవు. కాన 'వేదము అనధిగతార్థబోధకము, అజ్ఞాతార్థజ్ఞాపకము'- అనెడి ఆర్షసిద్ధాన్తమే గ్రాహ్యము. ఆహా! ప్రాచ్యాప్రాచ్య సిద్ధాంతముల కెంత యంతరము!

ఇట్టి యీ సిద్ధాంతములయందలి సామంజస్య తదభావముల వివరించుటకే భారతీనిరుక్తి యను నీ గ్రంథ మవతరించినది.

## భారతీనిరుక్తి - నామౌచిత్యము - నిరుక్తస్వరూపము

ఇది యొక అపూర్వ గ్రంథము. దీని పేరు భారతీనిరుక్తి. ఇందు వేదముల గూర్చి యీ మధ్యకాలమున నచ్చటచ్చట చెలరేగిన ఋషిప్రవరాశయ, విరోధ్యాశయ విశేషముల సామంజస్యాభావము సరసముగ, సప్రమాణముగ, సోపపత్తికముగ

నిరూపింపబడినది. వేదము యొక్క స్వరూప స్వభావాదుల దెలిసికొనవలయు నన్న వేదమునకు గల పర్యాయపదముల నిర్వచనముల గుర్తించుట ముఖ్య మని యీ గ్రంథకర్తలు నిశ్చయించుకొని, యీ గ్రంథమున నా నిర్వచనప్రక్రియా విశేషముల ప్రధానముగ ప్రదర్శించి యుండిరి. ఇది చాల ప్రశంసనీయమైన పద్ధతి.

భారతి యనగా వేదవాక్కు. తత్స్వరూప తత్త్వావబోధముల కొఱకై వివిధ నిర్వచనాది విశేషము లిందు ప్రదర్శింపబడుటచే నీ గ్రంథమున కీ సమాఖ్య యుపపన్నమై యున్నది.

"ప్రస్తావ స్తు ప్రకరణం నిరుక్తం పదభంజనమ్" — హేమచూడః.

నిరుక్త మనగా పదభంజన మని పై వాక్యము వలన దెలియును. పదమును భంజించి ప్రకృతి ప్రత్యయ విభాగము చేసి – ప్రకృత్యర్థ మేదియో, ప్రత్యయార్థ మేదియో నిరూపించి వ్యుత్పత్త్యాదులద్వారా నిష్కృష్టముగ - నిఃశేషముగ నా పదార్థము యొక్క స్వరూపస్వభావాదులు స్ఫుటముగ దెలిసికొనుట కవకాశము గలుగును. ఇట్టి ప్రక్రియకు నిరుక్త మని పేరు. ఇట్టి ప్రక్రియ బహుళముగ బ్రాహ్మణ భాగము లందు ప్రదర్శింపబడి యున్నది. కాననే భాష్యకర్తలును బ్రాహ్మణమును 'నిరుక్త' మని వ్యవహరించిరి.

'నిఃశేషేణ వచనం నిర్వచనం బ్రాహ్మణమ్' సా. భా. తై. ఆ. 1.6.3.

ప్రపంచము నామరూపాత్మకము. "అస్తి భాతి ప్రియం రూపం నామ చే త్యంశపంచకమ్ । ఆద్యత్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతో ద్వయమ్॥" అను వచనము గూడ జగత్తు నామరూపాత్మక మగుట స్పష్టము జేయుచున్నది. నామ మనగా పదము. దీనినే అభిధాయకము లేక వాచక మనియు వ్యవహరింతురు. "శబ్దే నోచ్చారితే నేహ యేన ద్రవ్యం ప్రతీయతే। తదక్షరవిధౌ యుక్తం నామేత్యాహు ర్మనీషిణః' అను బృహద్దేవతావచనము 'అర్థమును గూర్చిన జ్ఞానమును గలుగ జేయునది నామము' – అని చెప్పుచున్నది.

రూప మనగా నర్థము. దీనిని అభిధేయము, వాచ్యము—ఇత్యాది పదములతో వ్యవహరింతురు. 'అర్థః అభిధేయః శబ్దప్రత్యాయ్యః'—అని 'అర్థ' శబ్దార్థమును

నామలింగానుశాసన వ్యాఖ్యాతలు వివరించిరి. 'శబ్దప్రత్యాయ్యః'—అనగా శబ్దముచే తెలిసికొనదగినది. కాన అర్థమును బోధించునదియే శబ్దము; శబ్దముచే దెలియబడు నదియే యర్థము: అభిధేయమగు నర్థముతో సంబంధములేక శబ్దముగాని అభిధాయక మగు శబ్దముతో సంబంధములేక యర్థముగాని యుండవు; కాన శబ్దార్థములు లేక వాచ్యవాచకములు నిత్యానుబద్ధములు—అని తెలియును. దర్శనకారులును పద పదార్థసంబంధము నిత్య మని చెప్పుదురు.

"సిద్ధే శబ్దార్థసంబంధే"—"సిద్ధే శబ్దే అర్థే సంబంధే చేతి........। అథ సిద్ధశబ్దస్య కః పదార్థః ? నిత్యపర్యాయవాచీ సిద్ధశబ్దః" —మహాభాష్యమ్.

నిరుక్తశాస్త్రముకూడ శబ్దార్థములు నిత్యసంబద్ధము లని చెప్పుచున్నది.

"తథాఽవశ్యం యత్రార్థ స్తత్ర తదభిధాయక శ్శబ్దో యత్ర శబ్ద స్తత్ర తద్వాచ్యోఽర్థ ఇతి ........ సంబద్ధౌ హి శబ్దార్థౌ వాచ్యవాచకత్వేన నిత్యా మితి"

మీమాంసాశాస్త్ర మందలి "ఔత్పత్తిక స్తు శబ్దస్యార్థేన సంబంధః........" అను సూత్రముకూడ నీ విషయమునే నిరూపించినది. వేదశబ్దములకు తదర్థములకు గల సంబంధము ఆగంతుకము కాదు: అనాదిసిద్ధము. ఇంతియే కాదు. అన్వర్థము కూడ. 'అస్తి తావ ద్బ్రహ్మ నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావం సర్వజ్ఞం సర్వశక్తి సమన్వితమ్। బ్రహ్మశబ్దస్య హి వ్యుత్పాద్యమానస్య నిత్యశుద్ధత్వాదయోఽర్థాః ప్రతీయన్తే, బృహతే ర్ధాతో రర్థానుగమాత్'—అని యనుచు శ్రీ శంకరభగవత్పాదులును నిరుక్తశాస్త్రసంప్రదాయము ననుసరించి ధాత్వర్థవ్యుత్పాదనముద్వారా బ్రహ్మపదార్థ స్వరూప విశేషమును దర్శింపజేసి పద పదార్థ సంబంధ మన్వర్థ మగుట నిరూపించిరి. ఇట్టి ప్రక్రియ సర్వశాస్త్రసంమతము. అందుచే ప్రవృత్తినిమిత్తముల బరిశీలించుచు శబ్దార్థస్వరూప విశేష వివరణము జేయుట సంప్రదాయానుగతమై యున్నది.

పూర్వకల్పీయ వేదశబ్దములను తదనుగతములైన యర్థములను స్మరించుచు ప్రజాపతియు వేదశబ్దములతో సృష్టి గావించినటుల తైత్తిరీయబ్రాహ్మణము చెప్పు చున్నది. 'స భూ రితి వ్యాహరత్ స భూమి మసృజత' (పే. 68) శ్రుతిసిద్ధము

అయిన 'భూః' ఇత్యాది శబ్దముల స్మరించి వాని నుచ్చరించుచు ప్రజాపతి భూరాది లోకముల సృజించె నని యర్థము (చూ. బ్ర. సూ. దేవతాధికరణము. శం. భా.)

"వేదశబ్దేభ్య ఏవాదౌ నిర్మమే స మహేశ్వరః" - అను స్మృతివచనము ననుసరించియు పూర్వకల్పీయ వేదశబ్దార్థస్మరణ పూర్వకముగనే పరమేశ్వరుడు జగత్సృష్టి గావించినట్లు దెలియనగును. అందుచే వేదశబ్దములకు తదర్థములకును గల సంబంధ మాగంతుకము కాదు, అనాదిసిద్ధము, కాన వేదశబ్దము లన్వర్థములు. తదర్థానుగుణముగనే తదర్థావగమ్యమాన తత్స్వరూప స్వభావాద్యనుగుణముగనే - 'భూ'రాది (అర్థ)రూపసృష్టి జరిగిన దని తెలియును. శ్రుతియే వేదగతపదము లన్వర్థము లని కొన్ని యెడల నా యా పదముల నిర్వచనముల స్వయముగ బ్రదర్శించుటయు నిందుకు తార్కాణము.

ఉదా: (1) "ధాన్య మసి ధినుహి దేవాన్" —తై.సం. 1-1-6.1

ఇట ప్రీహి రూప మగు హవిస్సు ధాన్యశబ్దముతో నిర్దేశింపబడినది. ఈ మంత్రము "ధినుహి' యనుచు (ధిను ప్రీణనే) నీ ధాన్యశబ్దము ప్రీణనార్థక 'ధిను' ధాతు నిష్పన్న మగుటను సూచించుచున్నది.

(2) "య న్నవ మైత్ త న్నవనీత మభవత్। య దసర్ప త్త త్సర్పి రభవత్। య ద్ధ్రియత త ద్ఘృత మభవత్" —తై.సం. 2-3-10-1.

ఈ మంత్రము నవనీత, సర్పిస్, ఘృత శబ్దముల నిర్వచనముల బ్రదర్శించుచున్నది. ఇట్లే మంత్రములు, శబ్దములు ధాతునిష్పన్నము లగుటయు, పద పదార్థసంబంధ మన్వర్థ మగుటయు నిరూపించుచున్నవి.

వివిధశాఖాగతములైన యిట్టి వివిధనిర్వచనముల నాధారము చేసికొని వేదశబ్దస్వరూపముల నిర్వచించి అధ్యాత్మాధిదైవాది వివిధార్థములను, తదర్థావగమ్యమాన తత్తత్స్వరూప స్వభావ తత్త్వాదుల దర్శించు విధానమును నిరూపించుటకై ప్రవృత్త మైనదే నిరుక్తశాస్త్రము.

23

శబ్దము నిత్యము కా దనెడి తార్కికులును 'పదపదార్థగత వాచ్యవాచకభావ రూప సంబంధము శక్తి; అది యీశ్వరసంకేతరూపము. (అస్మా త్పదా దయ మర్థో బోద్ధవ్య ఇతీశ్వరసంకేతః శక్తిః)' - అని యనిరి. ఈశ్వరసంకేత మన నీశ్వరేచ్ఛ. ఈశ్వరుడు నిత్యుడు. సర్వజ్ఞుడు. ఈశ్వరీయ జ్ఞానేచ్ఛలును నిత్యములు-అని వారి సిద్ధాంతము. ఈశ్వరుడు సర్వజ్ఞుడు, అనగా నతిరోహిత సర్వపదార్థాభిజ్ఞుడు. కావుననే సర్వజగత్సర్జనకర్త కాగలుగుచున్నాడు. ఎవ డే కార్యమునకు కర్తయో యతడా కార్యస్వరూప స్వభావ తద్ధేతు సామగ్రులను గూర్చిన యపరోక్షజ్ఞానము, తచ్చికీర్ష, తదర్థమైన యత్నము గలిగినవాడై యుండ వలెను. లేనిచో తత్కార్యమును గూర్చి యాతడు కర్త గాజాలడు. అందుచే, 'స్వోపాదానగోచర అపరోక్షజ్ఞాన చికీర్షా కృతిమత్త్వం కర్తృత్వమ్' - అని కర్తృలక్షణమును బరిష్కరించిరి. సర్వజగత్కర్త గాన నీశ్వరుడు సర్వపదార్థ విషయకమైన యపరోక్షజ్ఞానము గలవా డనుట యుపపన్న మగును. అట్టి కర్తయు సర్వజ్ఞుడు నగు ఈశ్వరుని సంకేతరూపము, వాచ్యవాచక భావరూప సంబంధము నగు శక్తి (శబ్దములకును తదర్థములకునుగల సంబంధము) అన్వర్థము. అది యాగంతుకము (యాదృచ్ఛికము-ఘుణాక్షర న్యాయసిద్ధము) కాదు. - అను విషయమును స్పష్టము జేయును. అట్లు కానిచో ఈశ్వరుని సంకేత మన్వర్థము కాకపోవును. అట్టియెడ ఈశ్వరుని సర్వజ్ఞత్వమునకే భంగము వాటిల్లును.

ఈ పదపదార్థసంబంధము, దానిని గూర్చిన సంప్రదాయ విశేషములు మన యీ భారతీనిరుక్తిగ్రంథ మందు నైతము బ్రహ్మ, కవి-కావ్య, భారతీ-ఛందః ప్రకరణములం దచటచట సప్రమాణముగ సోపపత్తికముగ వివరింపబడినది.

కాన దేవభాషయగు సంస్కృతభాషయందలి పదజాత మంతయు నన్వర్థము. అందుచే నిర్వచనపూర్వకము తత్పదార్థ తత్స్వరూప తత్స్వభావాది పరిశీలనముజేయుట యత్యంతావశ్యకము. ఇట్టి నిర్వచనప్రక్రియ శాకటాయనాది మహర్షిసమ్మతము. నిరుక్తికారుల సిద్ధాంతము, శ్రుతి స్మృతి పురాణేతిహాసాది సంప్రదాయానుగతము.

## నిరుక్తశాస్త్రలక్ష్యము - భారతీనిరుక్తి

ఈ నిర్వచన ప్రక్రియకు ప్రయోజనము లేక లక్ష్యము ఏది ?

'నిరుక్తి—నిరుక్త' — నిర్వచన శబ్దములు సామాన్యముగ సమానార్థకములు. ఈ మూడును 'వచ పరిభాషణే' యను ధాతువు నుండియే నిష్పన్నము లగుచున్నవి. పదగత ప్రకృతిప్రత్యయాది విభజన పూర్వక తత్తదర్థ విశేషపరిశీలనము, యోగరూఢ్యాద్యర్థ వివేచనపూర్వక విశేషార్థపరిశీలనము గావించి తత్తత్పదగత యావత్సామర్థ్యానుబద్ధ కృత్స్నార్థ కథనానుకూల వ్యాపారము నిర్వచనము - అని చెప్పదగును. 'నిరుక్తం పదభంజనమ్' — అను నిఘంటు వచనము, అన్వ్యార్థత్వ ప్రకల్పనమ్—అను ఆలంకారికుల వచనము (అవతారిక) 'నిఃశేషేణ వచనం నిర్వచనమ్'—అను వేదభాష్యకారవచనము-ఇట్టి వచనము లన్నియు పై యర్థమును ధ్రువపరచుచున్నవి. పదములకు యోగరూఢ్యాది వృత్తిభేదము ననుసరించి బహ్వర్థ బోధకత్వ ముపపన్న మగును. పదములు అనేకార్థబోధకత్వ సామర్థ్యసంపన్నములు కాననే కావ్యములు కొన్ని సరసతమ విశిష్టజీవిత వైభవోపేతములై వరలుటయు, మఱికొన్ని శ్లేషకావ్యము లని ప్రసిద్ధి నొప్పారుటయు సంభవించుచున్నది.

'ఐంద్ర్యా గార్హపత్య ముపతిష్ఠతే'—అను శ్రుతివాక్యము ఇంద్రపద ఘటితమై ఇంద్రరూపార్థ ప్రకాశన సమర్థ మగుచున్న యొక మంత్రమునకు వినియోగము చెప్పదలచి యీ మంత్రముతో 'ఇంద్రోపస్థానమును చేయవలదు; గార్హపత్యాగ్నిని స్తుతించుడు' - అని విధించుచున్నది. ఈ మంత్రముతో గార్హపత్యాగ్నిని స్తుతించుచో నిందలి 'ఇంద్ర' పదమున కర్థమేమి చెప్పవలెను ? - స్తోతవ్యదేవత యగు అగ్నియే ఇంద్రపదముచే వివక్షితు డని చెప్పుట శాస్త్రమర్యాద. యోగవృత్తి నాశ్రయింపక ఇంద్రపదము అగ్ని దేవతాపరము కానేరదు. ఈ శాస్త్రీయ మర్యాద కొన్నియెడల వాచ్యవృత్తిని, కొన్నియెడల యోగాది వృత్త్యన్తరము నాశ్రయించిననే కాని యన్యథా ఉపపన్నము కానేరదు.

ఇట్టి మర్యాదను శ్రుతియే యచ్చటచ్చట స్వయముగ ప్రదర్శించినది. సావిత్ర కాఠక చయనమున శ్రుతియే 'సంజ్ఞానమ్, విజ్ఞానమ్, ప్రజ్ఞానమ్' — ఇత్యాది మంత్రముల పఠించి యీ సంజ్ఞానాది పదములు "పూర్వాపర పక్షగత ప్రతిపదాది తిథ్యాదిపరములు (పూర్వపక్షస్యాహోరాత్రాణాం నామధేయాని........అపరపక్షస్యాహోరాత్రాణాం నామధేయాని)"— అని వివరించినది. మరల నంతిమానువాకమున తిథివాచకము లగు నీ పదములే "అగ్ని-వాయు-ఇంద్ర-బృహస్పతి-ప్రజాపతి-బ్రహ్మలకును నామధేయ

ముఖనా గ్రహింపనగును. (అగ్నే ర్వా ఏతాని నామధేయాని.......బ్రహ్మణో వా ఏతాని నామధేయాని)"—అని శ్రుతి యాదేశించుచున్నది. ఇట్లే శతరుద్రీయ పదము లన్నియు—అవి ప్రాపంచికతత్తత్పదార్థ విశేష బోధకము లయ్యును అమృతరూప బ్రహ్మకు నామధేయము లని జాబాలోపనిషత్తు చెప్పుచున్నది. (శతరుద్రీయేణేతి—ఏతాని హ వా అమృతస్య నామధేయాని భవన్తి—తైర్హ వా అమృతో భవతీతి). ఐతరేయశ్రుతి చేతోవృత్తివిశేషవాచకము లగు 'సంజ్ఞాన-ఆజ్ఞాన-విజ్ఞానాది పదములు ప్రజ్ఞానరూప బ్రహ్మవాచకము లని చెప్పినది. (సంజ్ఞానమాజ్ఞానం విజ్ఞానం ప్రజ్ఞానం మేధా దృష్టి ర్ధృతి ర్మతి ర్మనీషా జూతిః స్మృతిః సంకల్పః క్రతు రసుః కామో వశ ఇతి సర్వాణ్యేవైతాని ప్రజ్ఞానస్య నామధేయాని భవన్తి).

పై శ్రుతివాక్యములఁ బరిశీలించినచో పదము లా యా ప్రకరణాద్యనుసారము వ్యుత్పత్తిచేతనే పదార్థబోధకము లగుటయు పరమాత్మవాచకము లగుటయు గమనార్హము. ఇట్టి శాస్త్రమర్యాదను దృష్టియం దుంచుకొనియే నీలకంఠపండితులును "శబ్దాః సర్వే యోగారూఢ్యా తత్తద్విశేషవాచకా అపి యోగార్థ మాదాయ సర్వే బ్రహ్మవాచకా అపి భవన్తి—అని దేవీభాగవత వ్యాఖ్యానమున వివరించిరి (పే. 452). మఱియు నిర్వచనసామర్థ్యమును బోధించు 'నిర్వచన'శబ్దమునుగూడ బ్రహ్మవాచకముగ శ్రుతియే యుదాహరించుటయు నిందుకు తార్కాణము. 'యత్రాద్వైతీభూతం విజ్ఞానం కార్యకారణకర్మనిర్ముక్తం నిర్వచన మనౌపమ్యం నిరుపాఖ్యం, కిం తదవాచ్యమ్'— మైత్రాయణీయోపనిషత్తు). అనిర్వాచ్య మగుటచే బ్రహ్మ 'నిర్వచనమ్' (నిర్గతసంజ్ఞావచనసామర్థ్యమ్, అవాచ్యమ్) అని యిట ప్రతిపాదింపబడినది. మోక్షమను పురుషార్థమైన ధర్మాదుల పురుషార్థ పదవ్యవహార్యము లైనయట్లు నిర్వచనార్థమైన (బ్రహ్మన బోధార్థమైన) తత్తద్వ్యుత్పత్తి నిర్వచనవ్యాపారము గూడ నిర్వచనార్థఫలప్ర మగుచున్నది.

నిరుక్తశాస్త్రము నందలి యంతిమాధ్యాయము ఆత్మజిజ్ఞాసాపరము: బ్రహ్మప్రాప్తిరూప బ్రహ్మభావ ఫలకము; మఱియు నా యధ్యాయము. "సైషా ఆత్మజిజ్ఞాసా సైషా సర్వభూతజిజ్ఞాసా, బ్రహ్మణః సార్ష్టిం సరూపతాం సలోకతాం గమయతి య ఏవం వేద"—అని యుపసంహారము గానవచ్చును. బ్రహ్మజిజ్ఞాసా భూతజిజ్ఞాసల

ద్వారా బ్రహ్మావబోధ బ్రహ్మభావసాధనము నిరుక్తగోష్ఠి యని పేర్కొనఁబడిన స్పష్ట మగు చున్నది. ఉపాంతిమాధ్యాయమున గూడ నీ నిరుక్తవిద్య శ్రుతి మతి బుద్ధి లక్షణ మని చెప్పబడినది.

"సేయం విద్యా శ్రుతిమతిబుద్ధిః"—నిరుక్తమ్.

"తే విద్యావంతః యే శ్రుతిం జానంతి; తే మతిమంతః యే అర్థేన
తర్కాన్ విశ్చిన్వంతి; తే బుద్ధిమంతః యే బ్రహ్మ జానంతి....
సేయం విద్యా శ్రుతి మతి బుద్ధి రిత్యుచ్యతే" —టిప్పణీ.

"తేన అత్ర ఇయం విద్యా శ్రుతిరూపా మతిరూపా బుద్ధిరూపా ఇత్యర్థః స్యాత్।
శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్య ఇత్యుపనిషత్సు ఉచ్యతే" —టిప్పణీ.

పై నిరుక్త తద్వ్యాఖ్యావచనములబట్టి గూడ నిరుక్తిప్రక్రియ శ్రవణ మనన నిదిధ్యాసరూపమై బ్రహ్మావబోధార్థ మగుట స్పష్టమగుచున్నది. కావున నిరుక్తగోష్ఠి పరమపురుషార్థసాధన మనియు గుర్తింపనగును (పే 685). నిరుక్తగోష్ఠి యట్టిది కనుకనే ఈ శాస్త్రమర్యాద ననుసరించి వేదస్వరూప తత్త్వార్థములను గ్రహింప జేయుటకై యీ భారతీనిరుక్తి వెలయింపజేయబడినది.

ఇట్టి సంప్రదాయమును దృష్టియందుంచుకొనియే ఈ భారతీనిరుక్తియందు వేదపర్యాయవాచకములయిన వేదః, ఋషిః, బ్రహ్మ, ఆమ్నాయః, శ్రుతిః, స్వాధ్యాయః, త్రయీ, ఛందః - అను ప్రధానవేదపర్యాయ పదములయొక్కయు, వానితోపాటు గౌణవృత్తితో వేదమును బోధింపగల స్వాహా-స్వధాదిశబ్దముల యొక్కయు వివిధనిర్వచనముల నుదాహరించి సంప్రదాయానుగత తదర్థపరిశీలనము గావింపబడినది. ప్రసంగవశమున ననేకములైన యితర శబ్దార్థనిర్వచనములను బరిశీలింపబడినవి.

## వేదనామధేయములు - వేదము యొక్క వేదత్వము

సర్వచేతనవర్గముచే నిరంతర మభికాంక్షింపబడెడి వస్తువు సుఖ మొకటియే. «పురుషైః సర్వైః రర్థ్యతే' — యను నిర్వచనము ననుసరించి పురుషార్థ మన నదియే

యని చెప్పబడుచున్నది. ఇట్టి యీ సుఖము నిత్యము, అనిత్యము నని రెండు విధములు; నిత్యము, విషయసంప్రయోగజన్యము కానిది; కేవల ఆత్మలక్షణము. అదియే మోక్షరూపము;—నిఃశ్రేయసరూపము, కాన నిదియే ముఖ్య (పరమ) పురుషార్థ మని యందురు. అది బ్రహ్మాత్మతత్త్వానుభూతిమాత్రలభ్యము. అనిత్యసుఖము ఐహికము, ఆముష్మికము నని చెప్పబడును. దీనినే అభ్యుదయ మని యందురు. విషయసంప్రయోగ జన్య మగు ఈ సుఖమే కామ పురుషార్థ మని చెప్పబడుచున్నది. 'కామ్యతే ఇష్యతే ఇతి కామః' — అని కామశబ్ద నిర్వచనము. దీని ననుసరించి యందఱిచే కోరబడునది గాన కామ మనగా సుఖ మని తెలియవచ్చు చున్నది. ధన ధాన్య గృహ క్షేత్రాదిరూపమగు నర్థము సుఖము నుద్దేశించియే కోరబడుచున్నది. గాని సుఖవాంఛలేక వానికొఱకే యని కోరబడుట లేదు. వానిని గూర్చిన ఇచ్ఛ సుఖేచ్ఛాధీనము; స్వతంత్రము కాదు. కావుననే యవి సుఖసాధనములు గావనెడి నిశ్చయము గల్గినపుడు వానిని గోరరు; స్వీకరింపరు. ఇది యనుభవసిద్ధ విషయము. అట్లే ధర్మవిషయమున గూడ. పురుషార్థములు నాల్గింటిలో మొదటిది ధర్మము. 'చోదనా లక్షణోఽర్థో ధర్మః (జై. సూ.) — అని ధర్మలక్షణము. అవశ్య కర్తవ్యముగ వేదములలో నేయ్యది విధింపబడినదో యదియే ధర్మము—అని యర్థము. కాన ధర్మ మనునది వేదైకసమధిగమ్యము; కాని అన్యము కాదని తెలియును. ఆ ధర్మము యజ్ఞ దాన తపో హోమాది రూపము. అది జ్ఞాతమై యథాశాస్త్ర మనుష్ఠింపబడినయపుడే యపూర్వోత్పాదనము ద్వారా అభ్యుదయ పరంపరా సంధాయకము కాగలదు. అదియే నిష్కామముగ ననుష్ఠితమై యంతఃకరణ పారిశుద్ధ్య సంపాదనముద్వారా నిఃశ్రేయస సాధనమును కాగలదు. కాన ధర్మముగూడ నర్థము వలెనే సుఖసాధన మగుచు నర్థింపబడుట స్పష్టము. కాన సుఖరూప పురుషార్థార్థము లగుచు ధర్మార్థములు పురుషార్థములుగ బరిగణింప బడుచున్నవి. కామ (సుఖ) మట్టిది కాదు. సుఖేచ్ఛ ఇతరేచ్ఛానధీనము. కావుననే 'ఇతరేచ్ఛానధీనేచ్ఛా విషయత్వం సుఖత్వమ్'—అని శాస్త్రకారులు సుఖలక్షణమును జెప్పుదురు. ఇట నొక విషయము పరిశీలింప నగును. అర్థము సుఖసాధన మయ్యును నది ధర్మానుబద్ధము కానియపుడు అనర్థహేతువును కాగలదు. కాన నభ్యుదయసాధన మగు ధర్మరూప పురుషార్థము ప్రధానము, దాని కంటెను నిత్యసుఖరూప మగు మోక్ష రూప పరమ పురుషార్థము ప్రధానము.

ఇట్టి ధర్మబ్రహ్మతత్త్వములు వేదైకసమధిగమ్యములు. రూపము నేత్ర గ్రాహ్యము, తదితర గ్రాహ్యము కాదు. శబ్దము శ్రోత్రమాత్ర గ్రాహ్యము. అట్లే అతీంద్రియములగు ధర్మ బ్రహ్మతత్త్వములు వేదైక గ్రాహ్యములు కాని ప్రత్యక్ష తదుపజీవ్యేతర ప్రమాణగ్రాహ్యములు కానేరవు. ప్రత్యక్షాది ప్రమాణములచే దెలియ జాలని ధర్మబ్రహ్మతత్త్వముల దెలియజేయుట (వేదయతి) చేతనే ఋగాది గ్రంథ రాశికి 'వేద' మని యన్వర్థనామధేయము. "ప్రత్యక్షేణానుమిత్యా వా యస్తూపాయో న బుధ్యతే। ఏతం విదన్తి వేదేన తస్మా ద్వేదస్య వేదతా॥" అని సంప్రదాయాభిజ్ఞులు చెప్పెడి వేదలక్షణము. వేదపదనిర్వచనమును పై యభిప్రాయమునే యభివ్యక్తము చేయును. ఈ నిరుక్తినిబట్టి అతీంద్రియార్థముల బోధించెడి వేద మపౌరుషేయము గాని పౌరుషేయము కాదని స్పష్టమగును.

అట్టి యీ యపౌరుషేయగ్రంథరాశిని గూర్చిన మన ప్రాచీనార్ష సిద్ధాంతములపై చారిత్రికు లారోపించెడి యాక్షేపము లన్నిటిలో - 'వేదము మానవరచితము' - అనునది ప్రధానమల్లస్థానీయము; మన యార్షసంస్కృతికి గొడ్డలిపెట్టు. ఈ యాక్షేపము పరిహృతమగుచో మిగిలిన యాక్షేపములు సామాన్యముగ వాని యంతట నవియే సురిగిపోగలవు. ఈ గ్రంథమున జూపబడిన వేదపర్యాయపద నిర్వచనము లన్నియు తన్నిరసనక్షమములు. అందును పూర్వోదాహృతమైన వేదపద నిర్వచనము (ప్రత్యక్షేణానుమిత్యా వా .... తస్మా ద్వేదస్య వేదతా) ప్రధానమై ప్రధానమల్ల నిబర్హణస్థానీయము కాగలదు. అందుచేతనే యీ యపౌరుషేయ గ్రంథరాశిని బోధించు పదము లనేకము లున్నను వేదపదనిర్వచన పరిశీలనముతో నీ భారతీనిరుక్తి గ్రంథ ముపక్రాంతమైనది.

ఈగ్రంథము పండ్రెండు ప్రకరణములు గల్గి సుమారు ఏడువందల పుటలతో నొప్పుచున్నది. గ్రంథారంభప్రయోజనాదులగూర్చిన విపుల మగు నవతారికయు రచయితలచే గూర్పబడినది. వేదములనుగూర్చిన వివిధపాశ్చాత్యచరిత్రకారుల, తదనుయాయులగు భారతీయుల వాదములందలి యసామంజస్యమును సోపపత్తికముగ నిరూపించెడి కాంచీకామకోటిపీఠాధీశ్వరులు జగద్గురు శ్రీ చన్ద్రశేఖరేన్ద్రసరస్వతీ శ్రీ చరణుల యుపన్యాసము గ్రంథారంభమున పొందుపరచుట యీగ్రంథమున కొక యలంకారము. జగద్గురువులకు హృదయపూర్వక పరఃశతనమోవాకములు.

ఈగ్రంథమున ప్రతి ప్రకరణమునను వేదబోధక పదనిర్వచనాదుల ద్వారా వేదస్వరూపస్వభావాదులు అర్వాచీనకల్పితాక్షేప పరిహారపూర్వకముగ విశదీకరింపబడినవి. ప్రసంగవశమున నతిగంభీరమగు దేవతాతత్త్వమును గూర్చియు, దేవపితృకర్మలు తద్రహస్యార్థముల గూర్చియు నెన్నియో విశేషాంశము లిందు సోపపత్తికముగ బ్రతిపాదింపబడినవి.

మఱియు నిందలి పండ్రెండు ప్రకరణములలో నిర్వచింపబడి వివరింపబడిన వేద-ఋషి- బ్రహ్మాది వేదనామధేయములలో నొక్కొక్కదానియం దొక్కొక్క విశిష్టతయు, వానిని గ్రహించి వివరించుటలో నొక క్రమగతియు గన్పట్టును-వానిని చూతము.

## వేదపద ప్రకరణము

ఈ ప్రకరణము ప్రధానమల్ల నిబర్హణస్థానీయ మని చెప్పబడిన వేదశబ్ద నిర్వచనముతో నుపక్రాంత మైనది. ఇందు 'వేదయతీతి వేదః' అను నిర్వచనమును బ్రదర్శించి వివరించుచు వేదశబ్దము ప్రమాణాంతరాజ్ఞాత ధర్మ బ్రహ్మ ప్రతిపాదనపర గ్రంథవాచక మగుటయేగాక వేదవేద్యుడగు పరమాత్మకును వాచకము కాగలదనియు 'విద్లృ లాభే' అను ధాతువునుండి నిష్పన్నమైన దగుట జేసి నిఖిలపురుషార్థ లాభహేతు వనియు సప్రమాణముగ నిరూపింపబడినది. 'విద విచారణే, విద సత్తాయాం, విద జ్ఞానే, విద్లృ లాభే' అను నాలుగు ధాతువులనుండియు నీ వేదశబ్దము నిష్పన్నమగును. అందుచే నీశబ్దము నాలుగు నిర్వచనములద్వారా వేదములు (1) బ్రహ్మతత్త్వ విచారపరములు, గనుక (2) బ్రహ్మవస్తుసత్తా నిరూపకములు, (3) బ్రహ్మతత్త్వ విజ్ఞానసాధనములు, గనుక (4) బ్రహ్మాత్మతా ప్రాప్తిసాధనములు-అను నర్థముల దెలియజేయుచు 1) ఋగాది మంత్రబ్రాహ్మణాత్మక గ్రంథరాశియంతయు వేదశబ్ద వ్యవహార్యము 2) బ్రహ్మతత్త్వనిరూపకము-అను నంశములను నిరూపించుచున్నదని సోపపత్తికముగ నిట వివరింపబడినది. కాన, వేద మనునది కేవలసంజ్ఞావాచకము గాదు; అన్వర్థము.

'వేదోఽసి యేన త్వం దేవ వేద' అను వాజసనేయమంత్రము మున్నగు వచనముల నుదాహరించి 'వేద-దేవ' శబ్దములు పర్యాయపదములు, వేదవాచక శబ్దములు పరమేశ్వరవాచకములు నగునని చక్కగ వివరింపబడినది. ఈ

మంత్రము ననుసరించి 'దైవీసంపత్సమృద్ధిచేగాని, వేదాది (దర్శపూర్ణమాసాది) యజ్ఞాది కర్మోపయుక్త పదార్థములయందు వైశిష్ట్యము (దివ్యత్వము) తెలియబడదు. అట్టి సంపదలేకున్న వేదగతాపౌరుషేయత్వాది మాహాత్మ్యములు గోచరింపక పౌరుషేయత్వాది బుద్ధియే యుదయించు'నని యిట సూచింపబడుట గమనార్హము.

'వేదః' అనునది సమస్తజీవులకును సామాన్యనామము. నామకరణ సంస్కార సమయమున తండ్రి 'వేదోఽసి' (బృ. 6-26) యనుచు నవజాతశిశువు నీ రహస్యనామముతో పిలుచును; పిదప వ్యవహారార్థమై రామ-కృష్ణాదినామముల బెట్టును. ఇది పరంపరాగతమైన సంప్రదాయము. 'వేదః' అనగా సమస్త వేదముల కభివ్యక్తిస్థానము, పర్యవసానము —అనగా పరమతాత్పర్యము నగు వేదనము (చిన్మాత్రము పరబ్రహ్మ, వేదః-వేదనమ్-జ్ఞానమ్) అని యర్థము. ఇట్టి యీ నామకరణసంస్కారముచే నీ రహస్యనామముద్వారా జీవుని వాస్తవస్థితి యగు పరమాత్మత్వము శైశవ దశనుండి యుపదేశింపబూనుట యను విధానము. ప్రాచీనార్ష దృష్టి యందలి నైశిత్యమును, మధురాతిమధుర భావోద్దీపకమగు మహత్త్వమును చాటుచున్నది. మఱియు నామకరణ సంస్కారమునకు బూర్వమే జాతకర్మ సమయమున శిశువు కుడిచెవియందు 'వాక్-వాక్-వాక్' అని ముమ్మారు తండ్రి జపింపవలె నని శ్రుతి యాదేశము (బృ. ఉ. 6-25). 'త్రయీలక్షణ మగు వేదవాక్కు నిన్నావేశించుగాక' యని తాత్పర్యము. తండ్రి యిటు వేదవాక్కును శిశువునం దావేశింపజేసి పిదప నామకరణసమయమున నా శిశువునకే 'వేదోఽసి'యని రహస్యనామ ముంచుట యెంతయు సరసతరముగ నున్నది. ఇట్లు అతిప్రతిభాన్విత గంభీరార్థదృష్టి నైశిత్య సూచకము లగు విశేషముల నెన్నిటినో యీ గ్రంథకర్తలు నిపుణముగ బ్రదర్శించినారు.

వేదపద మనగ దేవపదము. అనగా దేవతాతత్త్వ ప్రతిపాదకము. కృత్స్న వేదము నధ్యయనము చేయజాలనివారు ఒక్క దేవపదము నైన నధ్యయనము చేయవలెను (అప్యేకం దేవపద మధీయీత — శ. బ్రా.) అని శ్రుతి యాదేశము. కాన వేద పదములు దేవతాతత్త్వ ప్రతిపాదన పరములే గాని, చారిత్రికులు చెప్పునట్లు ప్రకృతి రామణీయకాది దృశ్య వర్ణనపరములు గావని సోపపత్తికముగ నిట వివరింపబడినది. అట్లే 'వేదములు మానవ రచితము లగునా?' యని ప్రశ్నించుకొని 'అగ్నేర్ ఋగ్వేదః' 'యో బ్రహ్మాణం విదధాతి పూర్వమ్' 'ఋచో నామాస్మి యజూగ్ంషి

నామాస్మి' 'అహే బుధ్నియ మంత్రం మే గోపాయ । య మృషయ స్త్రైవిదా విదుః' ఇత్యాది మంత్రార్థ పరిశీలనము ద్వారా 'వేదములు మానవ రచితములు గావు; ఇందు నియత పౌర్వాపర్యము లేదు. అపౌరుషేయము' లని నిరూపించిన విధానము ప్రశంసనీయము. ఇంతియే గాక, 'ఉపనిషత్తులయందు మాత్రమే అంతర్దర్శనము, సంహితాభాగముల యందు బాహ్య దర్శనమే గాని అంతర్దర్శనము లేదు' అని పాశ్చాత్యుల యాక్షేపము. ఈ ప్రకరణమున ఋగ్వేద సంహిత యందలి 'న విజానామి యది వేద మస్మి' ఇత్యాది మంత్రార్థ పరిశీలనము ద్వారా ఉపనిషత్ప్రతిపాదిత తత్త్వార్థమే సంహితాదుల యందును ప్రతిపాదింపబడిన దని సోపపత్తికముగ వివరించి పై యాక్షేపము సయుక్తికముగ పరిహరింపబడినది. వేదము యొక్క వేదత్వము నిరూపింపబడినది.

## ఋషిపద ప్రకరణము

పూర్వప్రకరణమున వేదశబ్ద నిర్వచనాదుల ద్వారా వేదము ప్రత్యక్షాది ప్రమాణాంతరాజ్ఞాత - అలౌకిక తత్త్వావేదకము, నిఖిల పురుషార్థ లాభహేతువు నగుటచే నపౌరుషేయ మని నిరూపింపబడినది. అది నిత్యసిద్ధ మయిన యపుడే దానికి అపౌరుషేయత్వ ముపపన్న మగును. అట్టివేదము నిత్యసిద్ధము, సర్వార్థావభాసకము అను నంశము ఋషిపదము సూచించును. అట్టి 'ఋషి' శబ్దార్థము ఈ ప్రకరణమున నిర్వచనాదుల ద్వారా చక్కగ నిరూపింపబడినది. "ఋషి ర్దర్శనాత్"— దీర్ఘ తపస్సమాధిలో వేదమును దర్శించుటచే వసిష్ఠాదులకు 'ఋషి' యని యన్వర్థ సంజ్ఞ. ఘటదర్శనము ఘటరూప విషయసత్తాధీనము. పూర్వసిద్ధమై యున్న ఘటమునే దర్శింతుము. అట్లు సిద్ధమై యుండనిచో తద్దర్శనము పొసగదు. అట్లే వేదదర్శనము పూర్వసిద్ధ వేదసత్తాధీనము. పూర్వసిద్ధమై లేనిచో "వేదమును దర్శించుటచే ఋషు లయిరి" — యనెడి శ్రుతి సంప్రదాయము, తదనుగుణమైన "ఋషి ర్దర్శనాత్" అనెడి పై నిర్వచనము సంగతములు కాకపోవలసి వచ్చును. వేదపదము వలె ఋషిపదము నన్వర్థమే కాని కేవల సంజ్ఞావాచకము కాదు. కాన ఋషిపదము, వేదము నిత్యసిద్ధమైన దను నంశము నభివ్యక్తము చేయుట స్పష్టము. నిత్యసిద్ధ మగుచో 'ఈశ్వరుడు వేదకర్త యని యనుట యెట్లు" అని యనరాదు.

నిత్యసిద్ధమై యున్న పూర్వకల్పీయ వేదము నభివ్యక్తము చేయుటచేతనే ఈశ్వరునకు వేదకర్త యని ప్రసిద్ధి.

"ఋషతి దర్శయతి-జ్ఞాపయతి-ధర్మాదిం పరమాత్మాన మితి ఋషి ర్వేదః" అను నిర్వచనము ననుసరించి ఋషిశబ్దము వేదవాచకము; "ఋషతి-పశ్యతి సర్వం" అను వ్యుత్పత్తి ననుసరించి పరమేశ్వరవాచకము నగు నని యిందు నిరూపింపబడినది. "య ఇమా విశ్వా భువనాని" (ఋ, 10.81.1) అను నీ ఋఙ్మంత్రము సర్వశాఖల యందును గలదు. ఈ మంత్రమున ఋషిశబ్దము పరమాత్మ విషయకము. "యతో వా ఇమాని భూతాని జాయన్తే"—మున్నగు నుపనిషద్వాక్యములలో వర్ణింపబడిన బ్రహ్మలక్షణము పై ఋఙ్మంత్రమునందు ల్లేఖింపబడినది. ఇట్టి మంత్రము లెన్నేని గలవు. వీనిని బరిశీలించి జూచిన "ఉపనిషత్తులందు మాత్రమే తత్త్వదర్శనము గలదు; మంత్రభాగములో లేదు" — అనెడి పాశ్చాత్యుల వాద మపేశల మని యిట చక్కగా నిరూపింపబడినది. వేదముల యందు గన్పట్టెడి "ఋషికృత్ మంత్రకృత్" ఇత్యాది పదములకు మంత్రద్రష్ట యనియే యర్థముగాని మంత్రరచయిత యని కాదు. అట్లే ఋషి యను పదమునకు మంత్రరచయిత యని చెప్పు పాశ్చాత్యుల యూహలు నిష్ప్రమాణములు, సంస్కృత భాషా స్వభావానభిజ్ఞతా సూచకము లనియు సప్రమాణముగ నిందు వివరింపబడినది. "ఋషీణాం పున రాద్యానాం వాచ మర్థోఽనుధావతి" యను భవభూతి మహాకవి శ్లోకమునందలి "ఆద్యఋషులు" మంత్రములే యగు ననుట యుక్తతర మని యిట నిరూపించుట గమనార్హము.

## బ్రహ్మపద ప్రకరణము

అపౌరుషేయ మగు వేదము నిత్యసిద్ధ మని పై ప్రకరణమున చెప్పబడినది. అట్టి వేదము నిరతిశయ మహత్త్వ సంపన్నము; పరబ్రహ్మతత్త్వ ప్రతిపాదకము అని బ్రహ్మశబ్దము సూచించును. ఈ ప్రకరణమున బ్రహ్మశబ్ద నిర్వచనాదుల ద్వారా పై విషయములు నిరూపింపబడినవి. బ్రహ్మశబ్దము "బృహి-వృద్ధౌ" అను ధాతువునుండి నిష్పన్నమైనది. ఇట వృద్ధి శబ్దముచే నిరతిశయ మహత్త్వ ముపలక్షితము. వేదశబ్దము స్వరూపతః మహత్త్వపూర్ణము కాన బ్రహ్మ యగును. నిరతిశయ మహత్త్వముగల బ్రహ్మను ప్రతిపాదించుట యందు పరమ తాత్పర్యము గలది యగుట

చేతను వేదము బ్రహ్మ. పురాణాది దశవిధ విద్యాస్థానములచే వ్యాఖ్యేయ మగు మహత్తరార్థము నవాంతర తాత్పర్యముచే ప్రతిపాదించునది యగుట వలన వేదము బ్రహ్మ. "బృంహయతి వర్ధయతీతి బ్రహ్మ". వేదవిహిత కర్మానుష్ఠానము చేతను వేదవాక్యార్థ విచారము చేతను జీవులకు క్రమముగ బరిచ్ఛిన్నభావమును పరిహరించి, బ్రహ్మ భావమును ప్రతిపాదించి వర్ధిల్లచేయునది గాన వేదము బ్రహ్మ. ఈ రీతిగ అపౌరుషేయము, నిత్యసిద్ధము నగు వేదము నిరతిశయ మహత్త్వపూర్ణము, నిరతిశయ మహత్త్వ సంపాదక మగును గాన బ్రహ్మ యన దగును.

మఱియు "యావద్బ్రహ్మ విష్ఠితం తావతీ వాక్" అను శ్రుతి వాక్-బ్రహ్మలు సమనియతము లని చెప్పుచున్నది. ఇట్లు బ్రహ్మసమనియత మగుట జేసియు వాక్కు బ్రహ్మ యగు నని యీ ప్రకరణమున చక్కగ నిరూపింపబడినది

"బ్రహ్మశబ్దమునకు అర్థము క్రమముగ మాఱినది;" అనెడి చారిత్రికుల (హౌగ్, రూథ్ మున్నగు) విభిన్నవాదములను, బ్రహ్మణస్పతి యర్వాచీన దేవత యనెడి వాదము, బ్రాహ్మణములు వేదములు గావు, అనగా నపౌరుషేయములు కా వనెడి శ్రీ దయానందాదుల వాదము లిట ప్రస్తావింపబడి, యవి శ్రుతి సంప్రదాయానుగతములు గావని సప్రమాణముగ నిరూపింపబడుట గమనార్హము. మరియు విశ్వామిత్రాదిక పరిశీలనము జేసి మంత్రద్రష్ట లగువారే బ్రాహ్మణు లగుదురను నంశము గూడ నిట సరసముగ బ్రతిపాదింపబడినది.

వేద మన్నంత పావనము; అది నానాశాఖావిలసిత బ్రహ్మవృక్షము; నిరంతరాధ్యయనాధ్యాపనాదులచే రక్షింపు కొనదగిన కల్పవృక్షమట ! వేదము విషయమై భగవత్స్వరూపులగు వ్యాసాది మహర్షుల కెంత యాదరమో యీ క్రింది శ్లోకము వలన స్పష్ట మగును.

"బ్రహ్మవృక్షో రక్ష్యమాణో మధు హేమ చ వర్షతి ।
అరక్ష్యమాణ స్సతత మశ్రుపాతం చ వర్షతి ॥"

## ఆమ్నాయ-శ్రుతి ప్రకరణము

అపౌరుషేయమై నిత్యసిద్ధమయిన వేదము నిరతిశయ మహత్త్వ సంపన్నము, బ్రహ్మతత్త్వప్రతిపాదకమునై బ్రహ్మశబ్ద వాచ్యమగు నను విషయము పైప్రకరణమున జెప్పబడినది. అట్టి వేద విద్య (బ్రహ్మ) నిరంతర మభ్యసనీయము, గురు పరంపరా సమధిగమ్యము - అని ఆమ్నాయ-శ్రుతిశబ్దములు సూచించుచున్నవి. అట్టి ఆమ్నాయ శ్రుతి స్వరూపము, తన్నిర్వచనాముల ద్వారా యీ ప్రకరణమున వివరింపబడినది.

"మ్నా అభ్యాసే; శ్రు శ్రవణే" – గురుముఖమున శ్రవణము జేయుచు గురుముఖోచ్చారణానూచ్చారణ రూపమున గ్రహించి నిరంతర మభ్యసించి, బ్రహ్మయజ్ఞాదుల ద్వారా ఆమ్నాత మగు చుండు నది యని యర్థము. కాన వేదమునకు గల "శ్రుతి-ఆమ్నాయ" సంజ్ఞ లన్వర్థములు. శ్రవణైక సాధ్యము గాన వేదమునకు శ్రుతి యనియు, శ్రుతా యనియు, అనుశ్రవా యనియు వ్యవహారము.

"దివశ్చిదాపూర్వ్యా" — ఇత్యాది మంత్రములందు గల పూర్వ్యా, సనజా, ప్రత్నా మున్నగు విశేషణములు, వాక, అనువాక, అనూవాచాది పదములును అవిచ్ఛిన్న గురుపరంపరాప్రాప్తవిద్యయే వేదవిద్య; ఆ వేదవిద్య లిఖిత పాఠాదులచే గ్రహింపదగినది కాదు" అని తెలియజేయుచు వేదమునకుగల ఆమ్నాయత్వమును శ్రుతిత్వమును వ్యక్తము జేయు నని యట సోపపత్తికముగ నిరూపింపబడినది.

కొన్ని మంత్రములలో గానవచ్చుచున్న "నవ-నవ్య" — ఇత్యాది పదముల జూచి యా పదములకు సంప్రదాయసిద్ధ నిర్వచన ప్రక్రియల (ణు స్తుతౌ, నూయతే స్తూయతే ఇతి నవః స్తుత్యః) గ్రహింపజాలక, 'క్రొత్తది' — యను నర్థమును మాత్రమే గ్రహించి చారిత్రికులు జేయు కల్పన లిట సప్రమాణముగ నిరసింపబడినవి. అట్లే "బ్రాహ్మణకాలమున మంత్రముల రచన సన్నగిలినను పురోహితుడు గాథా రూపము లగు పద్యముల రచించి యజ్ఞమునందు వానిని గానము చేయవలె ననెడి నియమ మేర్పఱినది" - యనెడి చారిత్రిక కల్పన లత్యన్తాసమంజసము లనియు, "స్వయంకృత గాథలు వేఱు; మంత్రములు వేఱు" - అనుచు ఆశ్వమేధిక ప్రయోగాంతర్గత గాథాప్రసంగముల నుదాహరించి నిరూపించుట ప్రశంసనీయము.

ఆమ్నాయ మొక క్షీరాంబుధి: తన్మథనము (శ్రవణాద్యభ్యాసము) సాదరముగ జేయుచో దేవతలకును దుర్లభ మగు నమృతము (పరమపురుషార్థము) సిద్ధింపగల దని సప్రమాణముగ నిట వివరించుట సరసతరముగ నున్నది.

## స్వాధ్యాయ పద ప్రకరణము

అపౌరుషేయము, నిత్యసిద్ధము, నిరతిశయ మహత్త్వ సంపన్నము నగు వేదము గురుముఖైక వేద్యము, నిత్యాభ్యసనీయ మనియు పై ప్రకరణమున నిరూపింపబడినది. ఉద్దేశ కాలా ద్యనవచ్ఛిన్న మగు బ్రహ్మ-స్వాత్మరూపము, ప్రత్యగభిన్నము అను నంశమును వేదము స్వాధ్యాయశబ్దముచే సూచించును. అట్టి స్వాధ్యాయ స్వరూప మీ ప్రకరణమున పరిశీలింపబడినది.

స్వం అధ్యయనం స్వాధ్యాయః - ఆత్మతత్త్వ ప్రతిపాదక మగుటచే వేదము స్వాధ్యాయ శబ్దవాచ్యము. బ్రహ్మతత్త్వ ప్రతిపాదక మగుటచే వేదము బ్రహ్మశబ్ద వాచ్య మని పూర్వము చెప్పబడినది. స్వ (ఆత్మ) స్వరూపావబోధక మగుటజేసి వేదము స్వాధ్యాయ శబ్దవాచ్య మగునని యిట జెప్పబడినది. కాగా వేద ప్రతిపాద్య మగు బ్రహ్మ స్వాత్మరూపము, ప్రత్యగభిన్నము నగుట స్వాధ్యాయ శబ్దముచే స్ఫుట మగుచున్నది. బ్రహ్మ, స్వాధ్యాయాది పదములు పర్యాయవాచక ములుగ శ్రుతి, స్మృతి పురాణేతిహాసాదుల యందును, నిఘంటువుల యందును ప్రసిద్ధములు.కాన 'స్వాధ్యాయోఽధ్యేతవ్య' అను వాక్యము కృత్స్న వేదపరము గాని కొందఱనునట్లుగ కేవల స్వశాఖామాత్రాధ్యయనపరము గాదని రచయితలు సోపపత్తి కముగ నీ ప్రకరణమున నిరూపించిరి. "స్వాధ్యాయోఽధ్యేతవ్య" అను శ్రుతివాక్యము కృత్స్నవేదాధ్యయన విధాయకము అయ్యును అశక్తుల విషయమున స్వశాఖాధ్యయన మాత్ర విధాయకము నగును — అను విషయము మితాక్షర - భాట్టచింతా మణి - న్యాయసుధా - శాబరభాష్యాది గ్రంథోదాహరణ పూర్వకముగ నిట జక్కగ వ్యక్తము జేయబడినది. స్వాధ్యాయ పదమునకు స్వశాఖారూప వేద మనియే గాక వేదము, బ్రహ్మయజ్ఞము, ప్రణవాది మంత్రజపము, మోక్షశాస్త్రాధ్యయనము అను నట్టి యర్థములు సంప్రదాయానుగతములు గాని, కీత్, మాక్సుముల్లర్ మున్నగు పాశ్చాత్య పండితులు చెప్పినట్లు "తనకు దాను వల్లెవేసికొనుట" యని మాత్రమే అర్థము కాదని వారి వాదము సప్రమాణముగ నిరసింపబడినది.

స్వాధ్యాయము ఆత్మచికిత్సకము; తపోరూపము. 'తపో హి స్వాధ్యాయః'. పరమాత్మను దర్శించుటకు స్వాధ్యాయ యోగములు చక్షుః స్థానీయములు; నారద వ్యాస వాల్మీకాది మహర్షు లందఱు స్వాధ్యాయ తపో నిరతులే; కాన స్వాధ్యాయము పరమాత్మ తత్త్వావబోధన క్షమ మనియు నిట జక్కగ నిరూపింపబడినది.

## స్వాహా స్వధా వషట్ పద ప్రకరణము

దిగ్దేశ కాలాద్యనవచ్ఛిన్న మగు బ్రహ్మ స్వాత్మరూపము; తాదృ గాత్మస్వరూప ప్రతిపత్తిహేతువు గాన వేదము స్వాధ్యాయ మని పైన జెప్పబడినది. స్వాధ్యాయ పదోద్దిష్టమగు బ్రహ్మాత్మైకత్వ ప్రతిపత్తి సిద్ధించుటకు ప్రతిబంధనివృత్తి యావశ్యకము. శ్రుతి విహిత దేవ పితృకర్మా ద్యనుష్ఠానాదుల వలన గాని ప్రతిబంధములు తొలగవు.

స్వాహా, స్వధా, వషట్ శబ్దములు వైదిక దైవ పిత్ర్య కర్మాద్యనుబద్ధములు. ఇంతియే కాదు. మాయా (హ్రీం) బీజాదుల వలె మహామహిమాన్వితములై యుపాస నాది రూప తంత్రానుబద్ధములు నగును. కాన నీ స్వాహాది పదములు శాస్త్రీయ కర్మోపాసనా యోగాదుల కుపలక్షకములు. ఏత దుపలక్షిత కర్మోపాసనా యోగాద్యను ష్ఠానములు ప్రతిబంధ నివృత్తిద్వారా బ్రహ్మాత్మైకత్వ ప్రతిపత్తి ప్రయోజకములు కాగలవు. అట్టి కర్మాద్యనుష్ఠానావశ్యకతను సూచించుట కయియే స్వాధ్యాయ పద ప్రకరణానంతరము స్వాహా-స్వధా-వషట్ శబ్దప్రకరణము లుపక్రాంతము లయినవి.

స్వాహా, స్వధా, స్వాధ్యాయశబ్దములకు సాదృశ్యము కలదు. 'స్వం అధ్యయనం స్వాధ్యాయః ; స్వం ఆహ స్వాహా ; స్వం దధాతి స్వధా'. - ఆత్మవిషయకము—అను నర్థ మనుగతమై యీ పదములయందు గన్పట్టును. స్వాహా, స్వధా, వషట్ శబ్దములు హవిర్దానవాచకములై కర్మానుష్ఠానావశ్యకత బోధించు మంత్రములు. హవిస్సులయందును, యజమానునియందును దివ్యత్వము నాపాదించెడి మహిమాన్వితమంత్రములు. ఇంతే గాదు. ఇవి వాగ్వాచకములు — వేదవాచకములు, పరదేవతావాచకములును నగును — అను విషయముగూడ నీ ప్రకరణములందు నిరూపింపబడినది.

## స్వాహా

స్వాహాకారపూర్వకముగ దేవతలకొఱకై చేయబడు హవిఃప్రక్షేపమునకును, ప్రక్షిప్యమాణ హవిర్ద్రవ్యమునకును ఆహుతి యని పేరు. ఇంతియే కాదు. ఆహుతి శబ్దమునకు దేవతాహ్వానరూప విశేషార్థమునుగలదు. ఆయాహుతి స్వర్గమునయజమానుని కొఱకై వెలయుచు నాతని నాహ్వానించునది; స్వాహాకారసంబంధముచేతనే అగ్ని — యజమాన — స్తుతివాక్ — హవిస్సుల (ఆహుతుల) యందు దివ్యత్వము సిద్ధించును. అగ్నీంద్రాదిదేవతలకు దేవతాశరీరము, భౌతికశరీరము రెండును గలవు-వారు పరోక్ష ప్రియులు — ఇత్యాది విశేషాంశము లీ ప్రకరణమున సప్రమాణముగ వివరింపబడినవి.

'స్వకీయా వా గాహ ; స్వయం సరస్వతీ ఆహ ; స్వో మహిమా ఆహ ; సు ఆహ; స్వం ఆహ - అని యీ విధముగ స్వాహాపదమునకు పెక్కునిర్వచనములు, తద్గత విశేషములు నిందు జక్కగా ప్రదర్శింపబడినవి. స్వాహాశబ్దము నిపాతరూపము. ప్రకరణానుసారముగ ప్రోక్షణా ద్యనేకార్థముల బోధింపజాలినది—యని 'కృష్ణో స్యాఖరేష్ఠోఽగ్నయే త్వా స్వాహా (తై. సం. 1-1-11-1). —అను మంత్రవ్యాఖ్యాన సందర్భమున భాష్యకారులు వివరించిరి. మంత్రాంతర సంబంధము లేకయే స్వాహా శబ్దము కల్యాణార్థవాచకము కాగలదు. కాననే కొన్నియెడల కేవల స్వాహా శబ్దముతో హవిర్దానాచమనాదులు చేయుటయు సంప్రదాయానుగతమై కానవచ్చుచున్నది.

## స్వధా

వరాదేవత యగు స్వాహాదేవియే పితృయజ్ఞములందు స్వధారూపిణి యగుచున్నది. స్వధయే పితరులకు వషట్కార స్థానీయము; స్వధాశబ్దము కేవలము హవిర్దానవాచకమే కాదు; క్రియావాచకము; అన్నవాచకము; అన్న మనగా భోగ్యము; దృశ్యమగు బ్రహ్మాండ మంతయు భోగ్యమే; కాన సర్వజగ దుపలక్షకము. ఇంతియే కాదు. స్వధ యన పారమేశ్వరశక్తి(మాయాశక్తి, అవిద్య); చిద్రూపుడగు పరబ్రహ్మ; అస్మదాదుల [illegible] ; భోగము ; భోగాయతన మగు అన్నమయ దేహము ; పరలోక యాత్రల యందు జీవు ననుగమించి వచ్చు దేహాంతరారంభక విద్యా కర్మ-పూర్వప్రజ్ఞలు; ఉదకము (స్వం నారాయణం దధాతీతి స్వధా ఉదకమ్); ప్రాణధారణ

శక్తి — ఇత్యాద్యర్థముల బోధించునది - యనుచు తదర్థావగమ్యమాన విశేషాంశము లిందు సప్రమాణముగ ప్రదర్శింపబడినవి.

స్వధాశబ్దవాచ్యు లగు అగ్నివాయ్వాదిత్యులు శ్రాద్ధదేవు లట ! వారే పితృ, పితామహ, ప్రపితామహ స్వరూపులు. శ్రాద్ధకర్మలయందు వారు తృప్తు లయి శ్రాద్ధకర్తలకును, ఆ యా లోకములయం దే రూపములతో నున్నను తత్పితరులకును తృప్తిని గల్గింతురట ! పితృకర్మలయం దిట్టి రహస్యాంశము లిట జక్కగ నిరూపింపబడినవి. స్వాహా స్వధాశబ్దములు పుంలింగమున పరమేశ్వరవాచకములుగ ప్రసిద్ధములు.

## వషట్

"ప్రణమ్య ఋగ్యజుః సామ్నే స్వాహాయ చ స్వధాయ చ ।
వషట్కారాత్మనే చైవ తుభ్య మర్థాత్మనే నమః॥"

పరమేశ్వరుడు శబ్దార్థాత్మకుడు, వషట్కారాత్మకుడు—అని యిట వర్ణింపబడినాడు. కాన స్వాహా స్వధా శబ్దముల వలెనే వషట్కార మీశ్వర వాచకము నగును. ఆశ్రావయ, అస్తు శ్రౌషట్, యజ, యేయజామహే, వషట్-అను నైదును యాగశరీరము నిష్పన్న మగుటకు ప్రధానములయిన మంత్రములు. యాగము నందు వినియోగింపబడెడి యితర మంత్రజాల మంతయు వస్త్రాలంకారాది స్థానీయము. అట్టి యీ మంత్రముల యర్థవిశేషములు, మాహాత్మ్యములు నిట జక్కగ వివరింపబడినవి.

వౌ (ఆదిత్యః) షట్ (ఋతవః) = వౌషట్,—వాక్ (ఆదిత్యః) షట్ (ఋతవః) = వషట్, వాక్ (శ్రుతిరూపా) షట్ (అంగాని) = వషట్,—సర్వం వశం కరోతీతి వషట్ – ఇత్యాద్యనేక నిర్వచనముల ననుసరించి వషట్ అనగా హవిర్దానవాచకమగు మంత్రమే కాక షడంగోపేత వేదవాక్కు, పరాదేవత, షడృతుప్రతిష్ఠితు డగు ఆదిత్యుడు, ఋతు (ఋత్విజ) ప్రతిష్ఠిత మగు వేదవాక్కు, హవిస్సుల వహించెడి దేవపాత్రము, ఓజః స్సహ శ్శక్తి సంపన్నము లగు వాక్ప్రాణములు, ఆశ్రావయేత్యాది మంత్రపంచకముచే హూయమాను డగు విష్ణువు, జగత్తును తనవశమున నుంచుకొను

పరమేశ్వరుడు, ఛందస్స్వ డగు ప్రజాపతి—అని యీ రీతిగ వివిధార్థములు, తదర్థావగమ్యమాన విశేషాంశములు నిం దెన్నియో సప్రమాణముగ వివరింపబడినవి. వషట్-శబ్దోచ్చారణపూర్వక హవిర్దానముచే నాదిత్యానుగ్రహమున సర్వర్తుసంపదలు గలుగగలవు—అని యిట వివరింపబడుట గమనార్హము.

ఇట్టి యీ స్వాహా, స్వధా, వషట్, హంతకారములు వేదరూప వాగ్ధేనుస్తనము లనుచు వీని ప్రాశస్త్యము శ్రుత్యనుగుణముగ వర్ణింపబడినది. ఈ పదములకు పాశ్చాత్యులు చేసెడి వ్యాఖ్యలు పదనిర్వచన మర్యాదానుగతములును సంప్రదాయానుగతములును గావని యిట చక్కగ నిరూపింపబడినవి.

## త్రయీపద ప్రకరణము

కర్మాద్యనుష్ఠానముల ద్వారా ప్రతిబంధములు తొలగించి తుదకు బ్రహ్మాత్మైక్య ప్రతిపత్తిని సిద్ధింపజేయునట్టిది వేద మని పై ప్రకరణము వలన దెలిసినది. ఇక త్రయీశబ్దము ఋగ్యజుఃసామ మంత్రావచ్ఛిన్నమై యనంతశాఖాసంమితమైన వేదరాశిని బోధించుచునే వేదగతశాఖలన్నియు నేకార్థసమవేతములు అనెడి యజ్ఞాతార్థమును దెలియచేయునది యని యీ ప్రకరణమువలన దెలియనగును. త్రయః అవయవాః యస్యాః సా త్రయీ, ఋగ్యజుఃసామరూప మగు నవయవత్రయముతో నొప్పునది—యని యర్థము. ఇట్టి యవయవములతో భాసిల్లుట యన్ని వేదశాఖలయందును గలదు. కాన కృత్స్నవేదరాశియే గాక ప్రతివేదశాఖయు త్రయిపే యగును. అవయవములగు శాఖలు అవయవి యగు శాఖికి ఉపకారకము లగుట స్వభావము. వృక్షగత వివిధశాఖలు విభిన్నధర్మములతో నొప్పక సమాన ధర్మములు గలి వృక్షమున కుపకారకము లగును. అట్లే విభిన్నవేదశాఖలును విభిన్నార్థప్రతిపాదన స్వభావము గలవి కావు. ఏకార్థ సమవేతము లని చెప్పుట యుక్త మని త్రయీశబ్ద పరిశీలనముచే దెలియనగును. బాదరాయణమహర్షియు 'గతి సామాన్యాత్'—అను బ్రహ్మసూత్రముచే నీ విషయమును నిరూపించినాడు. ఇట్లు శాఖలన్నియు నేకార్థసమవేతములే కాని విభిన్నతాత్పర్యకములు గావని యంగీకరింపవలసియుండుటచే వీశాఖలు భిన్నకర్తృకములై యుండియుండు ననెడి పాశ్చాత్యుల కల్పనలకు తావులేదు. ఇట్టి మహార్థ బోధనసమర్థము త్రయీశబ్దము.

త్రయీపదము వేదశాఖావాచకము, వేదత్రయవాచకము, వేదసామాన్యవాచకము నగుట గమనార్హము.

"అథర్వవేదము ఋగాది వేదత్రయ రచనానంతరకాలిక రచన; దానికి మొదట వేదత్వమే లేదు; తరువాత కల్పింపబడినది"- అని యిట్లు బ్లూమ్‌ఫీల్డు, రాధాకృష్ణన్ మున్నగు చారిత్రికులు చేయుకల్పనల నిరసించి త్రయీ స్వరూపమును ప్రత్యేకముగ నిరూపించుటకై యీ ప్రకరణము ప్రధానముగ నుపక్రాంతమైనది. "ఋచః సామాని జజ్ఞిరే" ఇత్యాది మంత్రముల వలనను, 'ఇతి వేదా స్త్రయ స్త్రయీ' యనెడి నిఘంటు వచనముల వలనను, యజ్ఞం వ్యాఖ్యాస్యామః 'స త్రిభి ర్వేదై ర్విధీయతే'- ఇత్యాది కల్పసూత్రముల వలనను వేదత్రయమునకే త్రయీవ్యవహారము-అని యాపాతముగ గలిగెడి శంక యిట సప్రమాణముగ నిర్మూలింపబడినది. శ్రుతి గత వివిధశాఖల యందును, అథర్వవేదమునందును కొన్ని యెడల వేదత్రయప్రశంసయు మఱికొన్ని యెడల వేదచతుష్టయప్రశంసయు నుండుటచే వేదత్రయ బోధకవాక్యములు వేదచతుష్ట్వ నిషేధపరములు కాజాలవు; స్మృతి పురాణేతిహాస కావ్యాదులయం దెచటగూడ చతుర్థవేద నిషేధమును గూర్చిన ప్రసక్తియే లేకపోగా చతుర్వేద ప్రశంస బహుళముగ గలదు,- అను విషయములు సోదాహరణముగను సరసముగను నిరూపింపబడినవి.

సమస్తవేదములయందును మంత్రజాతమంతయు ఋక్-యజుః-సామ రూపమున త్రివిధముగనే గలదు. ఇట్టి మంత్రరూప-అవయవ త్రైవిధ్యమునుబట్టి కృత్స్నవేదరాశికిని, తద్గతప్రతిశాఖకును త్రయీ యని వ్యవహారము. యజ్ఞ ప్రయోగములందు ప్రధానులగు ఋత్విజులు నలుగురు. హోత; అధ్వర్యుడు; ఉద్గాత; బ్రహ్మ. ఏతత్కర్తవ్యార్థములను సాకల్యముగ బోధించుట కయి ప్రవృత్తము లయినవి నాల్గువేదములు. ఇట్లు మంత్రత్రైవిధ్యమును బురస్కరించుకొని, త్రయీత్వవ్యవహారములు, చతుర్విధ ఋత్విక్కర్తవ్యార్థరూప ప్రమేయ భేదమును బట్టి చతుష్ట్వవ్యవహారమును-ఇట్లు ద్వివిధ వ్యవహారము వేదమునకేర్పడినది. అందుచే త్రయీత్వవ్యవహారమును బురస్కరించుకొని నాల్గవదియగు నథర్వవేదము వేదము కాదనుట యత్యన్త మసమంజసము. ఈ విషయ మిట చక్కగా నిరూపింపబడినది.

అథర్వవేదమునకు బ్రహ్మవేద మని పేరు. యజ్ఞప్రయోగములలో బ్రహ్మ యను ఋత్విజునకు సంబంధించిన విషయజాత మంతయు సాకల్యముగ నిందు ప్రతిపాదింపబడినది. అథర్వవిదుడే రాజపురోహితుడు కానర్హుడు. కాన యజ్ఞప్రయోగాదులయందు మూడు వేదములకే వినియోగ మని యనుట పొసగదు. అథర్వవేదమునకు భైషజ్యవేద మనియు పేరు. యజ్ఞగత వైకల్యరూప రోగ విశేషములకు చికిత్సకు దగు బ్రహ్మకు సంబంధించిన వేదము గనుక భైషజ్యవేద మనియు, బ్రహ్మవేద మనియు వ్యవహారము. రక్షః పిశాచ శత్రు రోగాద్యుపద్రవములనుండి కాపాడునది (క్షతాత్ త్రాయతే), అనగా తన్నివర్తనక్షమ సిద్ధమంత్ర సంపన్నము గాన నిది క్షత్రవేదము. సంసారరోగ నివర్తక బ్రహ్మతత్త్వ ప్రతిపాదకము గావునను బ్రహ్మవేదము-అని యిట్టి వేదనామౌచిత్యాదివిచారమువలనను నథర్వవేదముయొక్క వేదత్వ మవగతము గాగలదని పలుతీరుల నిట వివరింపబడినది.

అథర్వుడన ప్రజాపతి. తత్పుత్రులైన వసిష్ఠాదు లందఱు నథర్వాభూతులు. వారిచే దృష్టమైనదియే యథర్వవేదము. అంగిరసులచేతను భృగువులచేతను దృష్టమగుటచే నథర్వాంగిరో వేదము, భృగ్వంగిరోవేద మనియు వ్యవహారము. అంతియే కాని చారిత్రకు లూహించినట్లిది కొన్ని తెగలవారి రచన యనుట యనుచిత మనియు నిట సప్రమాణముగ వివరింపబడినది. 'గద్య పద్య గీతాత్మక రచనాశాలిత్వాత్ త్రయీ; కర్మ-ఉపాసనా జ్ఞానరూప కాండత్రయసంమితత్వాత్ త్రయీ; త్రాయతే అనర్థవ్రాతాత్ ఇతి త్రయీ'—అను నిట్టి నిర్వచనములు ఋగ్యజుః సామవేదముల యందు వలెనే నాల్గవదియగు నథర్వవేదమునందు ననుగతములుగాన అథర్వవేదముగూడ త్రయీపద వ్యవహార్యము కాగలదనుట యుపపన్నమే యగును.

## కవి – కావ్య ప్రకరణము

ప్రతిబంధనివృత్తికై కర్మానుష్ఠానావశ్యకతను బోధించెడి వేదము బహుశాఖా సంమిత మైనను భిన్న భిన్నార్థప్రతిపాదన తత్పరము కాదు; ఏకార్థసమవేతము-అని పై ప్రకరణము వలన దెలియును. అట్టి వేదము సర్వార్థావభాసక మగుటచే సర్వజ్ఞము కావున నప్రామాణ్య శంకాకలంకితము కాదు; కాన నది కవిశబ్దవాచ్య మగును

మఱియు కర్మోపాసనాదులద్వారా చిత్తమునకు సరసత నాపాదించుచు చమత్కార ముగ రమణీయతమ బ్రహ్మరస ప్రతిపాదకము నగుటజేసి కావ్యమును నగు ననెడి యర్థమును సూచించునవి కవి-కావ్య శబ్దములు. అట్టి కవి-కావ్య శబ్దార నిర్వచనాదు లీ ప్రకరణమున వివరింపబడినవి.

శ్రుతియే 'ఏతే వై కవయః య దృషయః' — ఇత్యాది వాక్యములచే తనను కవి యనియు, 'త్రయీ వై విద్యా కావ్యం ఛందః'—ఇత్యాది వాక్యములచే కావ్య ముగను నిర్దేశించుకొనినది. ఇంతేకాదు. తాను ప్రభుసంమితముగ వరలుచునే 'య స్తిత్యాజ' ఇత్యాది మంత్రములచే తనకుగల సుహృత్సంమితత్వమును, 'ఏవా హ్యస్య సూనృతా'— ఇత్యాది మంత్రములచే తనకుగల కాంతాసంమితత్వమును గూడ వెల్లడి చేసికొనినది. అందుచే వేదములు ప్రభుసంమితములు మాత్రమే యనెడి వాద మాపాత రమణీయము మాత్రమే. 'మాతా రుద్రాణాం', "కవిః కావ్యేన పరిపాహి రాజన్"— ఇత్యాది మంత్రార్థముల వివరించుచు వేదమే కొన్ని యెడల ప్రభు సంమితముగను, మఱికొన్ని యెడల సుహృత్ సంమితముగను, నింకొకయెడ కాంతా సంమితముగను నా యా యధికారి భేదమునుబట్టి సాక్షాత్కరించుచుండు నని సప్రమాణముగ నిట వివరింపబడుట గమనార్హము.

వేద మేకార్థసమవేతము, సచ్చిదానందలక్షణ పరతత్త్వ (రస) వర్ణనమునందు పరమతాత్పర్యము గలది. ఆ తత్త్వము సర్వజ్ఞము. ప్రధానముగ కవిపదవ్యప దేశ్యము. తత్ప్రతిపాదన తత్పర మగుటజేసి ప్రధానముగ వేదము కావ్యపద వ్యపదేశ్యము (కవేః పరమాత్మన ఇదం కావ్యమ్). కాన వేదమునకుగల కావ్యత్వ మౌపచారికము కాదు; ముఖ్యము—అని నిరూపించుటకై యిట నీ గ్రంథకర్తలు కావ్యలక్షణములను, కావ్యజీవితమును గూర్చిన వివిధవాదములను బరామర్శించిరి. నిష్కృష్ట కావ్యలక్షణ లక్షితము వేదమే; రసాత్మక రమణీయతమ (కమనీయ) హ్లాదైకమయ బ్రహ్మవస్తువు ఇందలి ప్రధానవస్తువు. కాన వేదమే పరమోత్తమ కావ్యము; చారిత్రికు లీ సంప్రదాయానుగత రమణీయతమ కావ్యాత్మ యగు పరమరసము నెఱుగరు — అని యీ ప్రకరణమువలన సప్రమాణముగ నిరూపింప బడుట ప్రశంసార్హము.

'కబ్బృ వర్ణనే, పదమో రథేవః, కవతే చాతుర్యేణ వర్ణయతీతి కవిః'—అనియు కవిశబ్ద నిర్వచనము. అతీంద్రియమై సచ్చిదానందాత్మకమైన పరతత్త్వమును వర్ణించు చాతుర్యము వేదమునకే గలదు. అన్యుల కది యసాధ్యము. అనన్యసాధారణ కవిభావసంపన్నము వేదమే కాన వేదమే కవి యని చెప్పదగినది.

## భారతీపద ప్రకరణము

వేదము సర్వజ్ఞము; కవి; అధికారిభేదము ననుసరించి ప్రభు, సుహృత్, కాంతాసంమితత్వ రూపములతో సాక్షాత్కరించు ఆదికావ్యము-అని పై ప్రకరణమున వివరింపబడినది. అట్టి యీ వేదకావ్యము సర్వలోకవ్యాపి మానవాది సర్వజీవో ద్ధరణకై ప్రవృత్త మగుట భారతీపదము సూచించుచున్నది. అట్టి భారతీస్వరూప మీ ప్రకరణమున వివరింపబడినది.

భారత మన లోకము. ప్రజలకును భారతు లని సామాన్యవ్యవహారము. లోకమును లేక ప్రజను ఉద్ధరించుటకై ప్రవృత్తమగుటంజేసి వేదమునకు 'భారతీ' యని యన్వర్థనామము. స్వప్రకాశ సంవిద్రూప మగు చిద్ఘనవస్తువునకు 'భా' యని పేరు. అట్టి పరతత్త్వమును ప్రతిపాదించుటయందు రతి (తాత్పర్యము) కలది యగుటజేసియే వేదవిద్యకు 'భారతీ' యని పేరు. అట్టి వేదవాణిని తద్ద్వారా పరతత్త్వమును ఆరాధించువారు భారతు లనబడుదురు. అంతియేగాని 'భరతు లనెడి యొక జాతివారిచే నారాధింపబడు అగ్ని భరతుడు; ఆ తెగవారిని రక్షించెడి యొక దివ్యశక్తి భారతి; భరతు లన ఒకపురోహితవర్గమువారు' అని యీ రీతిగ చెప్పబడెడి చారిత్రికకల్పనలు సంమంజసములు గావని యిట ప్రదర్శింపబడినది.

పృథివ్యంతరిక్ష ద్యురూప లోకత్రయదేవతలు అగ్ని (వసు)-వాయు (రుద్ర) ఆదిత్యులు—ఆ దేవతాత్రయమునం దనుగతయైయుండు వాగ్దేవతయే 'ఇడా-సరస్వతీ-భారతీ' యను నామములతో వ్యవహరింపబడుచుండును. ఈముగ్గురు దేవతలకు నియతసాహచర్యముగలియట్లు యాగాంగభూత మంత్రములయందు గానవచ్చుచున్నది. అందు ఇడాదేవత దేవతాహ్వానకారిణీ, కర్మమార్గోపదేశకర్త్రి, యజ్ఞనేత్రీ; సరస్వతి బుద్ధిసంస్కారకారిణీ, సంశయ విపర్యయాది మనోదోష నివారిణీ, మానస (ఉపాసన

తత్త్వప్రకాశిక: భారతి భరతరూప-ఆదిత్యానుగత ; జ్ఞానతత్త్వ ప్రకాశిక. ఆదిత్యుడు రసము నాదానించి సంస్కరించి యందించు దేవత. అట్లే సర్వతోవ్యాప్తమై యున్న బ్రహ్మామృతానంద రసము నాదానించి (ప్రతిపాద్యవస్తువుగా స్వీకరించి) తన్నారాధించు జనులచే నా రసము నాస్వాదింపజేసెడి వేదవాణి భారతి. ఇంతియే గాదు ; బిభర్తి సర్వ మితి భారతః' అను వ్యుత్పత్తి ననుసరించి అగ్నివాయ్వాదిత్యులును భారతులు. జగద్భరణక్షమము లగుటంజేసి తద్దీప్త్యాదులకును 'భారతీ' యను నామ మొప్పును. భరతు డనగా నటుడు. పరమేశ్వరుడును మహానటు డగుటచే భరతుడు. 'యథా హి భరతో వర్ణై ర్వర్ణయత్యాత్మన స్తనుమ్। నానారూపాణి కుర్వాణ స్తథాఽఽత్మా కర్మజా స్తనూః॥' అను యాజ్ఞవల్క్యవచనమున నీ విషయము వ్యక్తము చేయబడెను. సర్వజగద్భరణకర్త గావునను పరమాత్మ భరతుడు. తత్ప్రతిపాదకమగుట చేతను వేదవాణి భారతి—ఇత్యాది విశేషాంశము లెన్నియో యీ ప్రకరణమున వివరింపబడి చారిత్రికుల వాదములు చక్కగ నిరసింపబడినవి.

## ఛందః పద ప్రకరణము

సర్వజ్ఞ మగు వేదకావ్యము మానవాది సర్వజీవోపకారార్థమై ప్రవృత్తమయి నటుల భారతీపద ప్రకరణము వలన దెలిసినది. ఆ కావ్యము ఆత్మానందరూప మగు రసమును నిగూఢముగ నాచ్ఛాదించుచు తత్స్వరూప విచారపరులై యాదరముతో తన నారాధించు ధీరులకు రసలక్షణ మగు నమృతము నభివ్యక్తము చేయు నని ఛందఃపదము సూచించును. కావ్యకన్య, రసజ్ఞులగు సహృదయుల హృదయముల యందే సరసత నాపాదించుట ప్రసిద్ధముగదా ! అట్టి త్రయీవిద్యారూప కావ్యము యొక్క ఛందస్త్వ మీ ప్రకరణమున వివరింపబడినది.

ఛందస్త్వ మొక మంత్రభాగముననే గాక మంత్రబ్రాహ్మణాత్మక కృత్స్న వేదరాశి యందంతట వ్యాప్తమై యున్నది. అందుచే 'గాయత్ర్యాది ఛందః సంబంధముగాని ద్రష్టలగు ఋషుల సంబంధముగాని లేనందునను, మంత్రవ్యాఖ్యాన రూపము లగుటచేతను, కాత్యాయనుడు తప్ప తదితర ఋషిసంమతము కాకపోవుట చేతను బ్రాహ్మణములకు ఛందస్త్వము (వేదత్వము) లేదు-అనెడి శ్రీ దయానందాదుల వాదము లిట ప్రస్తావింపబడి కోశ, దర్శన, శ్రౌతగృహ్యాదిసూత్ర, పురాణాది

వాక్యోదాహరణ పూర్వకముగ ఖండింపబడినవి. వేదస్వరూప విజ్ఞాన విశేష సంపాదకములగు సమాధానప్రక్రియ అత్యంతమనోహరముగ, సువిపులముగ నిందు ప్రతిపాదింపబడినవి.

నిరుక్తశాస్త్రము నందలి కౌత్సుని పూర్వపక్షము నాధారముజేసికొని మాగ్డొనెల్ పండితుడు చేసిన యాక్షేపము లన్నియు సప్రమాణముగ నిట నిరసింప బడినవి.

'ఛాదనాత్ ఛందాంసి' - మృత్యువునుండి యాచ్ఛాదించి కాపాడునవి; 'ఛందయన్తి ఆహ్లాదయన్తీతి ఛందాంసి' - లోకోత్తరాహ్లాదకర రమణీయవస్తు (బ్రహ్మ) ప్రతిపాదకములు; 'స్వచ్ఛందయోగేన పరమాత్మని ప్రమాణం భవంతీతి ఛందాంసి' - స్వేచ్ఛగా (అన్యనిరపేక్షముగా) పరమాత్మతత్త్వ ప్రతిపాదనతాత్పర్యము గలవి గనుక వేదములు ఛందస్సులు. ఛాదనార్థమును బురస్కరించుకొనియే గాయత్ర్యాది ఛందస్సులకును ఛందస్సు లని వ్యవహారము. ఛాదన మన యావరణము. పారమేశ్వరతత్త్వము నావరించియుండు పారమేశ్వరశక్తియు ఛందఃపదవాచ్యమే. స్వప్రతిపాద్యమగు (పరమలక్ష్యమగు) పరతత్త్వమును తత్ప్రతిపాదక శబ్దరూపమున నంతరాంతరముల నుంచుకొని యాచ్ఛాదించి యుంతీ విరాజిల్లునదిగాన శ్రుతియు ఛందఃపదవాచ్యము, యథాశాస్త్రము కర్మోపాసనాది మార్గములద్వారా తన నారాధించుచు శ్రవణాదులచే తనసన్నిధిని జేరగల్గిన పూతాత్ములగు ధీరులకు ఆ శ్రుతి తన యంతరాంతరముల నాచ్ఛాదింపబడియున్న రసనిధి నభివ్యక్తము జేసి తాను విశ్రాన్తవ్యాపారయై 'యత్ర వేదా అవేదాభవన్తి'- యను స్థానమున పరమాద్వైతభావమున సాధకుల స్థాపింపగలదు. అట్టిది వేదము. అదియే ఛందస్సు. అదియే అమృతాశ్రీః. తద్విచారమే యిట సునిపుణముగ గావింపబడినది.

## గ్రంథ కర్తలు - రచన

ఈ గ్రంథకర్తలు హరివంశజులు. వీరి వంశము ఒక విశిష్ట సదాచార సంపన్నము, శిష్టజన విభూషితము నైన సద్వంశము. శ్రీకృష్ణవేణీ మహానదీ పశ్చిమతీరస్థమైన చిలుమూరు గ్రామము వీరి పూర్వులకు నివాసస్థానము. ఈ గ్రామము పురాణ

ప్రసిద్ధ ఉభయ రామేశ్వర క్షేత్రాంతర్గతము. వీరు శ్రీ సీతారామ ప్రతిష్ఠిత "రామేశ్వర" సేవాతత్పరులై జీవితములను సార్థక పఱచుకొనుచుండిరి. వేదోక్తసత్కర్మాను ష్ఠానములయందు వీరు బద్ధహృదయులు. వీరి వంశములో నెందఱో శ్రౌతములగు జ్యోతిష్టోమాది సోమయాగములును, స్మార్తములగు వైశ్వదేవాదిపాకయజ్ఞములను గూడ నాచరించిన పుణ్యాత్ములు గలరు. "శైవా వయం న ఖలు తత్ర విచారణీయం, పంచాక్షరీ జపపరా నితరాం తథాఽపి, చేతో మదీయ మతసీకుసుమావభాసం స్మేరా ననం స్మరతి గోపవధూకిశోరమ్" అన్నట్లీ వంశజులు శివారాధనాసక్త హృదయు లయ్యును వీరి హృదయములు శ్రీహరి సంస్మరణానుషక్తములు. కాన వీరివంశము హరినామాంకితమైనది కాబోలు!

ఈ గ్రంథకర్తల ప్రపితామహులగు శ్రీహరి లక్ష్మీనారాయణ యజ్వ యొకపుడు తటాక నిర్మాణార్థము భూమిని త్రవ్వుచుండ సుందర శిలామయ వేణుగోపాల విగ్రహము లబ్ధమయ్యెనట! వారా విగ్రహమును చిలుమూరు ప్రక్కనేయున్న తమ ప్రకృత నివాసస్థానమగు ఈపూరు గ్రామమున ప్రతిష్ఠించి భక్తితో నారాధింపసాగిరి.

ఏతద్గ్రంథకర్తల మాతాపితరులు దుర్గాంబా సోమయాజులు. శ్రీ సోమయాజులు గారు శ్రీ వేణుగోపాల దేవునికి ఆలయప్రాంగణ నిర్మాణముచేసి తత్సేవాతత్పర హృదయులై కాలముగడుపుచుండెడివారు. స్వామి నిత్యార్చనాదులకై పలయు క్షేత్ర సంపత్తినిగూడ సమకూర్చి తమజీవితము ధన్య మొనరించుకొనిరి.

ఈ పుణ్యదంపతుల సంతానమే యీ గ్రంథకర్తలు. వీరి పినతండ్రి రామశాస్త్రి గారు సారస్వతప్రియులు. ఈ పెద్దల యాశీస్సులచే నీ రచయితలకు బాల్యమాదిగా విద్యాసముపార్జనాసక్తి, గురుదేవతా ప్రాజ్ఞ సంసేవనా తత్పరతయు కలిగి వృద్ధి నొందినవి. వీరు బాల్యమాదిగా సంస్కృత భాషాభ్యసన పరులు. అందు కొందఱు ఉన్నత శాస్త్రవిద్య నార్జించి పట్టభద్రులగుటయే గాక స్వయంకృషితో హూణభాష యందును దేశీయ భాషలయందును ప్రావీణ్యము సంపాదింపగలిగిరి.

ఈ సోదరుల సౌభ్రాత్ర మెన్నదగినది. వీరు తమ తండ్రి తాతలవలెనే అనాది కాల ప్రవృత్త భారతీయ నాగరికతా మూలసూత్రమైన అన్యోన్య సహకార పూర్వక జీవనవిధానమును ప్రధానలక్ష్యముగ నెంచి ఆదర్శప్రాయమైన వర్తనముగలవారై

ఈ గ్రంథమును రచయితలు తమకులదైవ మగు శ్రీవేణుగోపాలుని పాదార విందములం దర్పించిరి. గోవులన విద్యలు (వాక్కులు). గోపాలుడు వాని కధినేత. వేదవేద్యుడు గోపాలుడు. అట్టి శ్రీహరి రత్నరాశియగు నీ కృతిరత్నమును తన హృదయేశ్వరి (అమృతా శ్రీః)గా ప్రీతితో విస్ఫారితనేత్రుడై స్వీకరించెను.

'భారతీనిరుక్తి' హరిసోదరులను శ్రీశ్రీ జగద్గురు కాంచీ కామకోటిపీఠాధీశ్వర శ్రీచన్ద్రశేఖరేన్ద్రసరస్వతీస్వామిపాదుల దివ్యానుగ్రహమునకు పాత్రములుగ నొనర్చెను. శ్రీజగద్గురువులు శ్రీవేదమాతను (శ్రీగాయత్రీపరదేవతా) మూర్తిని వీరి కనుగ్రహించి, తమ యామోదమును వ్యక్తపరచిరి. శ్రీవేణుగోపాల, శ్రీజగద్గురుమహాస్వాముల యనుగ్రహముచే వీరి పరిశోధనాసంస్థ యగు 'నిరుక్త భారతి'నుండి భారతీయనాగరికతా వికాసమునకు దోహదకారులగు ఇట్టి యమూల్య గ్రంథము లెన్నియో వెలువడుగాత మని శ్రీవేదమాతకు కైమోడ్పులు చేయుచున్నాను.

"సత్యా స్సన్తు యజమానస్య కామాః"

యచ్ఛ్రుతి స్సర్వవిద్యాప్త్యై సర్వార్థాప్త్యై చ యస్మృతిః।
బ్రహ్మాత్మతాప్త్యై యద్బుద్ధిః కలయే తాం త్రయీం శివామ్॥

మచిలీపట్టణము
14-10-1971

కుప్పా లక్ష్మావధాని
(సాంగ స్వాధ్యాయ. భాస్కర)

కవిసమ్రాట్, కళాప్రపూర్ణ, పద్మభూషణ, ఆంధ్రాస్థానకవి

డా॥ విశ్వనాథ సత్యనారాయణగారు

# పరిచయము

ఈ గ్రంథము వ్రాసినవారు, నేను చాల ఏండ్లుగా విజయవాడలోనే యున్నాము. సుమారు ముప్పదియేండ్లుగా వారొక మహాగ్రంథము వ్రాయుచున్నారని, వైదికశబ్దముల మీద చాలపరిశోధన చేయుచున్నారని వినుటయే కాని నేను వారి యొద్దకుపోయి వారి పరిశోధనను తెలిసికొనవలయునని ప్రయత్నించినది లేదు. తరువాత కొన్నాళ్ళకు ఈ గ్రంథము పేరు 'హరినిరుక్తి' అని విన్నాను. చివరకు ఇది భారతీనిరుక్తి యైనది. ఈ గ్రంథమునందు వేద, ఋషి, బ్రహ్మ, ఆమ్నాయ-శ్రుతి, స్వాధ్యాయ, స్వాహా, స్వధా, వషట్ త్రయీ, కవి - కావ్య - భారతీ, ఛందః శబ్దములు వానిస్వరూపములు వానిరహస్యములు బహుగ్రంథపర్యాలోచనచేసి నిరూపింపబడినవి. ఈ గ్రంథమునకు 'భారతీనిరుక్తి' యని పేరు పెట్టబడినది. వీరర్థనిర్ణయము చేయుటకు చేసిన మహాప్రయత్నములో భారతీశబ్దము కూడ నున్నది. వీరికి భారతీ శబ్దార్థ నిర్ణయమునందు ఎక్కువ యభిమాన మేమో ! అయినను హరి శబ్దమును వారు వదలిపెట్టలేదు. వారి యింటిపేరు "హరి" వారు. అందఱును పండితులు. ఇన్నియేండ్లు అందఱును తలాకొంచెము శ్రమయు పడి యీ మహా కార్యమును చేసిరి. ఈ గ్రంథము పండ్రెండు భాగము లని చెప్పవచ్చును. ప్రతి భాగము మొదట వారే రచియించిన వేదమాతృస్తవ శ్లోకములు కలవు. ప్రతివాని లోను హరిశబ్దము గుంభితమై యుండును. ఆ శ్లోకములు మిక్కిలి రమణీయ ములుగా నుండును. మఱియు తత్తద్భాగములకు సూచకములుగాఁగూడ నుండును. అందుచేత 'హరినిరుక్తి' యన్నట్లే ?

ఇంత ప్రయాసపడి చేసినప్పుడు ఎన్నిగ్రంథములు చూచియుండవలయును. ఇందుదహరింపబడిన గ్రంథముల సంఖ్యయే రెండువందలకు దాటి యున్నది. అన్నియు వేదములు, ఉపనిషత్తులు, బ్రాహ్మణములు, ఆరణ్యకములు, సూత్రములు, పురాణములు, వృత్తులు, భాష్యములు, వార్తికములు, కోశములు.

ఇంక వారి పాండిత్యమును గూర్చి యేమి చెప్పవలయును? ఇందులో నింకొక్క రహస్యమున్నది. వేదమో ఋషియో స్వాధ్యాయమో ఛందస్సో త్రయీశబ్దమో యేదో యొక శబ్దమును తీసికొని దానిని గూర్చి సర్వంకషముగా వ్రాయవలయు నన్న ప్రయత్నమును సంకల్పించినచో ఆ గ్రంథములను చదివెడి లక్షణము వేఱు. ఆ శబ్దమును గూర్చి యెక్కడ నేమి వ్రాయబడినది? ఎట్లు వ్రాయబడినది? ఈ పరామర్శబుద్ధికి సర్వంకషముగా భాసింపనిచో నీపనిచేయుట సాధ్యము కాదు. ఇన్ని గ్రంథములలో తాము వ్రాయుచున్న యొక శబ్దముయొక్క యర్థమును నిరూపించుటకు ఎచ్చట నేది యున్నది? అన్న మతిబాహుళ్యము జ్ఞాపకశక్తియొక్క పరమార్థము, రెండును జతకూడవలయును.

ఈ గ్రంథము పేరు 'నిరుక్తి'. నిరుక్తము వేదాంగములలో నొకటి. యాస్కాచార్యులవారు వ్రాసిరి. పండితులకు తెలిసిన విషయమే! దుర్గాచార్యుడు దానికి భాష్యమును వ్రాసెను. అది నిరుక్తము. ఇది నిరుక్తి. అది క్తాంతము. ఇది 'క్తిన్' ప్రత్యయాంతము. క్తాంతము సామాన్యముగా భూతకాలమును గూర్చి చెప్పినను దానికి మూడు కాలములయందు ప్రయోగింపబడదగిన శక్తి యున్నది. అందుచేత నిరుక్తము - అన్నది వేదముయొక్క త్రైకాలికాబాధ్యార్థబోధకత్వము సూచించును. ఈ గ్రంథము వేదాంగము కాదు. అందుచేత నిరుక్తి. ఈ గ్రంథకర్తలయొక్క యౌచిత్యము ఇంత విస్పష్టమైన వైదికముగా నున్నది. వేదమాతను కొలిచెడివారి బుద్ధి యింకొకరీతిగా నుండునా? మఱియైనచో ఆ నిరుక్తమునకు ఈ నిరుక్తికి భేద మేమి? "యథా శబ్దలక్షణ పరిజ్ఞానమ్ సర్వశాస్త్రేషు వ్యాకరణాత్ ఏవం శబ్దార్థ నిర్వచన పరిజ్ఞానమ్ నిరుక్తాత్" — ఇవి దుర్గాచార్యులవారి మాటలు. శబ్దమునకు ప్రధానమైనవి యివి రెండే. మొదటిది శబ్దముయొక్క సుప్తస్వరూపము. రెండవది అర్థనిర్వచన పరిజ్ఞానము. దుర్గాచార్యులు నిరుక్తవిషయములను పన్నిదియాఱు చెప్పినారు. అందులో ప్రధానమైనది యిది.

"సర్వాణ్యాఖ్యాతజాని కానిచి దేవానేకధాతుజాన్యపీతి మంత్రాణా మర్థవత్వ మనర్థవత్త్వం విచార్య శాస్త్రారంభప్రయోజనద్వారేణ అర్థవత్త్వావధారణమ్".

ఈ లెక్కను జూచినచో ధాతుజములు కొంత ప్రాముఖ్యమును వహించును. మంత్రములయొక్క యర్థవత్త్వము అనర్థవత్త్వము ననగా సందర్భమును బట్టి యర్థము చెప్పవలె నని యర్థము. దాని పేరే శాస్త్రారంభప్రయోజనము. ఈ నిరుక్తి యందు తాదృగ్లక్షణము కొంతవరకైన నుండవలయును గదా! గ్రంథము సావకాశముగా చదివినచో కొంతవఱకే కాదు; తత్తచ్ఛబ్దార్థ నిర్ణయము చేయునట్లు. ఈ గ్రంథములో ప్రధానము శబ్దార్థనిర్ణయము చేయుట కాదు - శబ్దార్థ నిరూపణ చేయుటగా చెప్పవలె నేమో! కనుక నీ గ్రంథమునకు భారతీనిరుక్తి యని పేరు పెట్టుట మిక్కిలి సమంజసముగా నున్నది.

శబ్దమునకు రెండే ప్రధానవిషయములు — ఒకటి శబ్దస్వరూప నిర్ణయము; రెండవది శబ్దార్థనిర్ణయము. రెండవపని చేయుటయందు నిరుక్తము సమర్థమైనది. ఈ నిరుక్తి యీ మార్గము ననుసరించుచున్నది. దీనియందు ఋషులు సమర్థులు. యాస్కుడు ఋషి. ఋషులే యెందుకు సమర్థులనగా దుర్గాచార్యులవారు ఇట్లు వ్రాసిరి. 'సాక్షాత్కృతధర్మాణః ఋషయో బభూవుః' వారు సాక్షాత్కృతధర్ములు. అందుచేత యాస్కుని కర్థము సాక్షాత్కృత మయ్యెను.

ఈ హరి సోదరులు మేము ఋషితుల్యుల మని యనలేము. అనేక మహా గ్రంథములు చూచి ఋషులును ఋషితుల్యులును నిరూపించిన మహార్థముల నొక చోట నేకరించిరి. తరువాతి తరువాతి శాస్త్రప్రవక్తలు మందబుద్ధుల ననుగ్రహించుటకు కదా ప్రవచనముచేసిరి. వీ రాపని చేసిరి.

వేదమునందు చాలవఱకు ధాతుజములైన శబ్దములే కలవు. వానిని యాస్కుడు ప్రపంచించెను. ఆ మార్గమున నితరులును చేయవచ్చును. కాని చేయరాదు. ఎందుచేతననగా వీరు ఋషులు కారు గనుక. వేదములందు శబ్దములు బహూధా ధాతుజము లనగా ఆ ధాతువు లెచ్చటనుండి పుట్టినవి? ధాతువన్న శబ్దమున కర్థమేమి? ఈ శబ్దము-'డుధాఞ్'-ధారణపోషణయోః' అన్న ధాతువునుండి పుట్టినది. ధత్తే మిథః వ్యావర్తకం ధర్మమ్ — ధాతుః - భేదమైన ధర్మమును పరస్పరము

భేదమైనదాని నిది ధరించును. ధాతువనగా నిట్టిది. అనగా అదృశ్యము. దృశ్యము. రూపరహితము. రూపసహితము. ఇట్టి ధర్మములు పరస్పరము భేదించును. వాని రెంటిని ఈ ధాతువు ధరించును. ధాతువులు ఓంకార లక్షణముకలవి. వాయువునుండి పుట్టినవి. వాయువునం దున్నవి.

"బహుస్యామ్ ప్రజాయేయ" అని బ్రహ్మ సంకల్పించి నప్పుడు పరాశక్తి యుదయించినది; ఆమె యుదయింపక పోయినచో నిర్గుణమైన బ్రహ్మపదార్థమునకు సంకల్పముచేసెడి శక్తియే యుండదు. శక్తి సంకల్పములు రెండును సమానము లైనవి. తరువాత సృష్టి జరిగినది. "ఆత్మన ఆకాశః ఆకాశా ద్వాయుః" ఇంచు మించుగా పరాశక్తి ఆకాశమునకు అధినేత్రియై కూర్చున్నది. ఆమెయే వాయువును సృష్టించినది. ఆ సృష్టించినప్పుడు ఆ వాయువును సశబ్దమైన దానినిగా నిర్మించినది. కనుక వాయువునందు శబ్ద మున్నది, వేదము లందులోననే యున్నవి. ఈ యనంతమైన యాకాశమునం దభివ్యాప్తమై యున్న వాయువునందు సర్వసృష్టియు నిమిడి యున్నది. ఓంకారము తల్లితోకూడి జన్మించినది. తక్కిన శబ్దములు తత్కారణములైన ధాతువులు వేదగతశబ్దములకు మూలములైన ధాతువులు ఆ వాయువునందే యున్నవి. అందుకనియే ధాతువునకు "ధత్తే మిథో వ్యావర్తకం ధర్మం" అన్న వ్యుత్పత్తి చెప్పబడినది. అందుచేతనే వేదమునందు బహుధా ధాతుజములైన శబ్దము లున్న వనుట.

కొన్ని శబ్దముల వ్యుత్పత్తిని (వ్యుత్పత్తి కాదు ఉత్పత్తి) విచారించినచో నీ రహస్యము తెల్ల మగును. అన్నిటిని విచారించుట సాధ్యముకాదు. అది భగవంతునకే తెలియును. అన్నియు సాధ్యము కావు. ఈ యుత్పత్తిని విచారించుట యనగా నొక సామాన్యమైన మార్గ మున్నది. ఆ మార్గ మిది.

శబ్దగుణకమైన యాకాశము కలదు కదా! ఇది వాయువుద్వారా ప్రేరేపింప బడుచున్నది. "హృత్" అన్న శబ్ద మున్నది. ఇందు హకార ఋకారములు కలవు. ఎవనికి వాడు హకారము నుచ్చరించి చూచుకొన్నచో తెలియును. ముఖము పూర్తిగా వివృతమై గొంతుయొక్క లోపలినుండి యీ హకారము వచ్చును. ఒకటి యాకాశము; రెండు నాభినిర్గతమైన వాయువు—ఈ హకారోచ్చారణకు మూల మగుచున్నవి. తరువాత ఋకార ముచ్చరింపబడవలయును. నాల్కయు

వదన గుహోపరి భాగమును సూక్ష్మముగా కలిసినగాని యిది యుచ్చరింపబడదు. అనగా హకారము వినిర్గమన సర్వలక్షణము కలదియైనచో ఋకారము దానికి నిరోధక మగుచున్నది. ఎందుకు కావలయును? ఈ రెండును కలిసి ఈ సర్వ శబ్దోచ్చారణ మూలహేతువైన హృదయమును చెప్పవలయును. ఇది మఱియొకదానిని చెప్పలేదు. హృత్ ధాతువే సర్వధాతులక్షణమును చెప్పునట్టిది. ఈ 'హృ' అన్న యక్షరము-పండితులు శబ్దవేత్తలు వ్యాకరణరహస్యజ్ఞులు దానికి 'త'కారము కలిపిరి. ఈ 'త'కార మేమి చేయుచున్నది? దానిని తావన్మాత్రముగా నిలుపుచున్నది. అది వ్యాకరణశాస్త్ర రహస్యవిషయము. మనకు గావలసినది-సర్వశబ్ద మాకాశమున నిండి యున్నది. భగవంతునిచేత సృష్టింపబడిన సర్వము నొకటియే. అది ఒక మహాపురుషాకృతి. దానియందున్న పురుషలక్షణములే సూక్ష్మసూక్ష్మములై తన్మహాసృష్టిగాత మహాపురుష సర్వమూర్తి వ్యంజకముగా నుండి మానవుడుగా పరిణమించినది. ఈ మానవుడు సర్వమహాసృష్టిగత పురుషునకు చిహ్నము. అందుచేత సర్వమహాసృష్టిరూప భూతమహాపురుషలక్షణము లన్నియు వీనియందు కొంచెము కొంచెముగా నుండును. కొంతకొంత శక్తిమంతములుగా నుండును. కానిచో ఈ హృత్శబ్దముయొక్క యుత్పత్తి మనము నిర్ణయించుటకు సాధ్యమయ్యెడిది కాదు. ఇంతకు చెప్పదలచిన దేమి యనగా వేదగతబహుశబ్దములు ధాతుజము లనుటచేత ధాతువున కీ శక్తియెక్కడనుండి వచ్చినది యన్న ప్రశ్న పుట్టును గనుక ధాతువులు ఓంకార సద్బ్రహ్మరూప లనవలెను. అప్పుడు వేదములందలి బహుశబ్దములు ధాతుజన్యము లైనచో పరమేశ్వర సంకల్పము. సంకల్పములోని రహస్యము శక్తియొక్క యనుగ్రహము-అని యర్థమగును. వేదములు ఆఖ్యాతజములు ధాతుజములైన శబ్దముల కూడిక యైనచో అవి పౌరుషేయము లెట్లగును?

అసలు అపౌరుషేయ మన్న శబ్ద మున్నది—వేదము లపౌరుషేయములు కావు. ఒక ప్రవాహముగా వెళ్ళుచున్నది గాని వేదములు పౌరుషేయము లనుటయే న్యాయము. పురుష మనగా సాక్షాత్పరమేశ్వరుడు. సాంఖ్యమును గ్రహించినచో చైతన్యము పురుషుడు, జడము ప్రకృతి. కనుక వేదములు పౌరుషేయములు. కాని పురుషశబ్దము లోకమునందు పుంలింగవిశిష్ట వ్యక్తిపరముగా నధికముగా వాడబడుచున్నది. దానిని పురస్కరించుకొని యపౌరుషేయము లన్న వాదన.

ఈ వాదన చాల దినములుగా నున్నది- ఏండ్లుగా నున్నది. పునఃపునః ఖండితమై తిరిగి మొలకెత్తుచున్నది. అరటి చెట్టువంటిది. నరుకుదుము మరల దానిలోనుండి పిలక బయలుదేరును. ఈ లక్షణము విస్పష్టముగా నరటిమొక్కయందు కనిపించు చున్నదితక్క నిగూఢముగా సర్వవృక్షములయందున్నది.

ఎట్లు శబ్ద మాకాశమునందు నిండియున్నదో యా రీతిగా ఆ యా వస్తువుల యంకురము లా యా వస్తువులయం దున్నవి. అన్ని వాదములకు నీ లక్షణ మున్నది. ఆ శత్రువుయొక్క స్వరూపమట్టిది. వాని వాదమును నీవు మూలచ్ఛేదము చేయుము. నీ పరోక్షమునందు వాడు వాని వాదనయొక్క మూలస్వరూపమునే మరల ప్రారంభించును. అనుగుణమైన స్థలమునందు ప్రారంభించును, అది మరల పెరుగును. ఇది సృష్టిలక్షణము. దీనికి కర్త యెవడు? పరమేశ్వరుడు. పరమేశ్వరి కర్త్రి. దీనిపేరే మాయ. మనమెంత వాదించినను ఆ మాయ యచ్చటనేయున్నది; ఆ మాయమీద మన మధికారులము కాము. దాని ప్రథమ లక్షణము సంకల్పము. పరమే శ్వరియు నీ మాయయు నేకకాలసంభూతలు ఆమె యే ఈమె. ఈమె యే ఆమె-యన్నట్లుం దురు కాని సత్పురుషుడు ప్రయత్నము మానివేయరాదు. యాథార్థ్యముయొక్క నిత్యత్వ మును స్థాపించుటకు ప్రయత్నము చేయుచునే యుండవలయును. ఇది యివతల మరియొక తగాదా. ఇది వీని సాధనా స్వరూపము. ఈ సాధన లేనిచో ఆ పరమేశ్వర స్వరూపము గోచరముకాదు. అది గోచర మగుటకు నిది సాధన యగుట పరమేశ్వర సంకల్పము. ఇదియొక యాశ్చర్యము. ఆ రహస్యము అది యాశ్చర్యము.

"ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చి దేనమ్"

ఇది యిట్లుండగా నేను ఒకసారి శ్రీ హరివారి యింటికి వెళ్ళి యిది కొంత భాగము విని-యిట్టి గ్రంథము వీరు వ్రాయుచున్నా రని విని కదా వెళ్ళితిని—విన్న దానికి తత్పూర్వము విననందుకు మనసులో కష్టపడి, నా వయసుచేత నా యారో గ్యముయొక్క లోపముచేత తక్కినది వినలేక పోయితి నని చింతిల్లుచుండగా 'వారే దయతో మేమే మీ యింటికి వారము దినములు వచ్చి వినిపింతు' మనిరి. నా కాశ్చర్యము వేసినది. ఆనందము కలిగినది. వా రన్నట్లు వరుసగా పదునాలుగు దిన ములు సాయంకాలములయందు మా యింటికి వచ్చి - (వారి యిల్లు బందరురోడుమీద;

మా యిల్లు ఏలూరురోడ్డుమీద. దారి మొగలిపూవాసనలు వేయవలసి యుండును- ఇప్పు డా వాసనలు లేవు. ముంద్దే మిగిలినవి)—నాకు వినిపింప నారంభించిరి.

నేను రెండానందములలో మునిగి యుంటిని. మొదటిది యింతటి మహా గ్రంథము వారు వచ్చి నాకు వినిపించుచుండుట ; రెండవది యిది యింతటిది నేటి కాలమునకు మిక్కిలి యవసరమైన గ్రంథ మగుట. ఈ రెండుభావములయొక్క బరువుచేత నాకూహాశక్తి పోయినది. ఒకనాడు నే నంటిని కదా। 'నేను దీనికి పీఠిక వ్రాయవలయును'—అని. వారు దయతో నంగీకరించిరి. ఈ మాట యనకముందు నే నొక్కటి యూహ చేయవలసియుండెను. ఇన్నాళ్ళుగా వీ రీ గ్రంథము రచించుచుండగా నెంతమంది పండితులు దీనిని విని యుండవలయును ? వారు దీనికి పీఠిక వ్రాయుటకు నే మహాపురుషులను ఏ మహాపండితుల నెన్ను కొనిరో యన్న విషయ మూహ చేయలేకపోవుట. మందబుద్ధుల కూహ తక్కువ కదా ! తీరా విచారింపగా శ్రీజగద్గురువులు శ్రీ శ్రీ కంచి కామకోటిపీఠాధిపతులును. అస్మద్గురువులైన వేదాంతభాస్కర శ్రీ కుప్పా లక్ష్మావధానులు గారును పూర్వమే దీనికి పీఠికాకర్తలుగా నిర్ణయింపబడి రని తెలిసినది. నా గుండె జారిపోయినది. తరువాత వారితో మనవి చేసితిని—"అయ్యా ! వారు వ్రాయగా నేను వ్రాయుట యేమి ? పొరపాటున నన్నాను. క్షమించవలయు" నని, శ్రీ హరివారు కాదని పట్టుబట్టిరి. ఏమి చేయవలయును ? 'అయినచో వారు వ్రాసిన పీఠికలు చూచిన తరువాత ఏదో లౌకికముగా నేను వ్రాసెదను లెండి'—యని యంగీకరించితిని. గ్రంథకర్తలు పీఠికలను తీసికొని వచ్చి నాకు చూపించిరి. భయము విచిత్రమైన గుణము. దానియొక్క తొలుతటి చిక్కదనము క్రమముగా తగ్గిపోవును. ఈ కడచిన రెండు నెలలుగా నాకు తీరిక కాలేదు. ఇప్పుడైనను తీరిక చేసికొని వ్రాయు చున్నాను. ఏదో వ్రాయుటకుకూడ తీరికయే కావలయును.

మఱియొక విషయము. నేను ప్రధానముగా ననుకొన్నది యిది—యిట్టి గ్రంథము ఒక మహారాష్ట్రదేశమున గాని కలకత్తాలో గాని వ్రాయబడినచో దానికి రెండు విశిష్టములైన లక్షణము లుండెడివి. వ్రాసెడివారు యమ్. ఏ.,లు గాని డాక్టర్లు గాని ఒక విశ్వవిద్యాలయములోననో గొప్పకళాశాలలోనో సంస్కృతో పాధ్యాయులుగా నుండి, వారి గురువులు మహామహోపాధ్యాయులై యుండి, ప్రేరకులు

ఆ విశ్వవిద్యాలయాధ్యక్షులైన యొక యూరోపుదేశీయుడైన సంస్కృతపండితుడో, సంస్కృతాభిమానియో యైనవాడై యుండెడివాడు. ఈ గ్రంథము ఇంగ్లీషుభాషలోనే వ్రాయబడి యుండెడిది. రెండవది యేమనగా సులభముగా ముద్రితమై యుండెడిది.

శ్రీ హరివారికి యీ రెండుబాధలును లేవు. వారు ఇంగ్లీషులో వ్రాయరు. ఈ గ్రంథము నచ్చొత్తించుటకు వారి కెవ్వరి సహాయము నక్కఅలేదు. అందుచేత నీ గ్రంథమునకు వారిగ్రంథమునకు వచ్చెడి ప్రచారము తొలగిపోయినది. కాని యట్టి వారెవ్వరో దీనికి గ్రంథకర్త యైనచో నీ గ్రంథమింత నిష్కల్మషముగా నుండెడిది కాదు. ఈ గ్రంథము పాశ్చాత్య చరిత్రకారులయొక్కయు, పాశ్చాత్య పండితులయొక్కయు, వారి యనుమాయాయులయొక్కయు సంప్రదాయేతరభావములను ఖండించుటకే నిర్దేశింపబడినది. అచ్చముగా సంప్రదాయమును పోషించుటకు వ్రాయబడినది. సంప్రదాయ మనగా చక్కగా అధికముగా నిచ్చునది — యని యర్థము. ఈ గ్రంథ మట్లు చేయుచున్నది.

ఈ గ్రంథస్థవిషయములను విపులముగా చర్చించుట సాధ్యము కాదు. అందందు కొన్నివిషయములను నాబుద్ధికి తోచినట్లు ప్రపంచించుటకు ప్రయత్నింతును.

గ్రంథకర్తలు ఈ గ్రంథము నెందుకు వ్రాసిరి? వారే యిట్లనుచున్నారు– "వేదము అపౌరుషేయము, సనాతనము, స్వతఃప్రమాణము, క్రాంత దర్శి, తపఃసమాధిగోచరము, అనాదినిధనము, స్వయంజాతము, బ్రహ్మాత్మత్త్వావ బోధకము, పురుషార్థ సాధనము; గురు శిష్య పరంపరా ప్రాప్తము, పరమపావనము, శ్రీరూపము "అనియు నందుచే చరిత్రకారులు చెప్పునట్లుగా - 'పురుషబుద్ధికల్పితము; ఒకనాటి సాంఘిక రాజకీయాది చరిత్రను బోధించుటకు ప్రవృత్తము' - కాదనియు మున్నగు నంశములు స్పష్టపడగలవు."

ఇందు ప్రధానముగా ఒకనాటి సాంఘిక రాజకీయాది చరిత్రను వేదమునందు చదువుట న్యాయ్యము కాదు. చదివినచో చదువవచ్చును. ఆలంకారికుల భాషలో చెప్పినచో నొక పరమసౌందర్యవతియొక్క శరీరావయవములను వర్ణించు నట్టిది. ఆమె లావణ్యము. ఆమె శృంగారరసమును పరిత్యజించి ఆమె యెన్ని పౌండ్ల బరువున్నది? ఆమె కరచరణముల దైర్ఘ్య మెంత? ఆమె యెంత యెత్తున్నది? ఈ విషయము

లను విచారించుటవంటిది. ఇచ్చట నొక సంగతి యున్నది. పాశ్చాత్యుల తత్త్వమే యిది. ఆ జాతులు పెరిగిన లక్షణమే యిది. వారి నాగరికత యిట్టిది. లేనిచో ఆధునిక మైన వారి యీ ప్రకృతిశాస్త్ర మిట్లు విజృంభింపదు. వారు తత్త్వమును మనస్సుచేత తపస్సుచేత భావనాశక్తిచేత కనుగొనుటకు ప్రయత్నింపరు. దానిని తూచి కొలిచి యేవో లెక్కలు కట్టి తత్త్వదర్శనము చేయుదు మందురు. మనపూర్వులు చెప్పిన మాయ యనునట్టిది మానవులలో ప్రతివానియందు నిండి యుండుటయే కాక ఉండుటతో తృప్తి పడక వేతే కొన్ని దేశాలను తన స్వేచ్ఛా విహారముకొఱకు నిర్మించుకొన్నది. మనము వానిని గుఱించి విచారణ చేసి యేమి లాభము ? ఈ వేదము సృష్టిక్రమమును పలుచోట్ల పలువిధముల చెప్పును. వారి కిది కష్టముగా నుండును. వారికి వేద మర్థము కాదు. అర్థము కాకపోవుట వారి రక్తములో నున్నది. వారి యాహారములో నున్నది, వారి దేశపు గాలులలో నున్నది. వా రొక శబ్దముయొక్క యర్థమును నిర్ణయించుటకు దుర్గాచార్యులుచెప్పిన తదారంభప్రయోజనమును వదలిపెట్టి యది యెన్నిచోట్ల వాడబడినది ? ఏ యర్థములో నే యే చోట్ల వాడబడినది ? అని విచారించి ఒకచోటి యర్థమును మరియొక చోట చెప్పి బుద్ధిని కలుషితము చేసికొందురు. 'యథా రాజా తథా ప్రజా'. వారి యనుయాయులు నదే మార్గము ననుసరించుచున్నారు. దీనికి ప్రతిక్రియ యెవఁడు చేయవలెను ? పరమేశ్వరుడు చేయవలెను. ఆ పరమేశ్వరుడు కాలస్వరూపుడు. ఆ కాలము వారి కనుకూలముగానున్నది.

ఈ గ్రంథమునందు వేదశబ్ద మెన్నియర్థములయందు వాడబడియున్నదో చక్కగా చూపింపబడినది.

మరియొక వివాద విషయ మేమనగా వేదముయొక్క భిన్నభాగములు భిన్న కాలములయందు రచింపబడియుండును. ఈ వాదన యొకటి. ఈ పీఠిక వేదావిర్భావ స్వరూప లక్షణములతో ప్రారంభింపబడినది. అవి నిత్యములు. ఎందుచేత ? ఆకాశమునందు నిండియున్నవి గనుక. ఆకాశమునందు లేని శబ్దము లేదు. ఆ యాకాశము సృష్టికొఱకు బ్రహ్మనుండి వినిర్గమించినది. సృష్టికొఱకు ననుట చేత సృష్టికొఱకు కావలసిన దంతయు దానియందున్నది. ఆ లక్షణములతో నిండి యున్న యాకాశముననే బ్రహ్మమయమైన ప్రజాపతియొక్క చిత్కళ భాసించి

యున్నది. వేదముల దాక యెందుకు? సర్వకవుల, కావ్యములు, వేదజన్యము లైన పురాణాదికములు, నేడు నీవును నేను మాటాడుకొనుచున్న మాటలు కూడ నాకాశ మునం దున్నవి. ఒక జాతినుండి ఒక వ్యక్తినుండి భిన్నకాలములయందు ఆ శబ్దమే వెలువడుచున్నది. శబ్దము నెవడు సృష్టించినాడు? సృష్టించుట యెట్లు? శబ్ద మెచ్చటి నుండి వచ్చుచున్నది? ఎందుకు వచ్చుచున్నది? పరమాల్పిష్ఠమైన మానవశరీరనిర్మాణము, పరమ బృంహిష్ఠమైన మహా శరీరముయొక్క చిహ్నము కదా? ఏ మహాజన్యజనక భావము పట్టి అక్కడ శబ్ద ముత్పన్నమైనదో ఆ లక్షణ మిచ్చటను గన్పించుచునేయున్నది. మనుజునిలో నాకాశ మున్నది. నాభినుండి వాయు వుత్పన్న మగుచున్నది. శబ్దమిట్లుత్పన్న మగుచున్నది. ముఖావయవములు దాని కాకారము నిచ్చుచున్నవి. ఆ యక్షరముల సంఖ్య యంతతో నాగుటయేమి! అనంతాక్షరము లెందు కుత్పన్నము కాలేదు! ఎందుకు కావు? సర్వశబ్దము లా యక్షరముల నుండియే యుత్పన్నము లగుట యేమి? ప్రతి పదమునందు నీ మహా శ్చర్య ముండగా నా మహాశ్చర్యమును గూర్చి విచారింపకుండ నీ శబ్దములనుగూర్చి పరిశోధనచేయుట యెందులకు? పరమేశ్వరుడు జ్ఞానమును నిర్మించెను. దానిని మానవునియందు భాసింపజేసెను. ఇది రెండు విధములు. ఆంతరము, బాహిరము. ఈ బాహిరము మాయాసంబంధి. మాయాజనితులైన మానవులు దీనియందు కొట్టి కొని మెలికలు తిరిగి మృత్యువు నందుచున్నారు.

ఆకాశమునందలి శబ్దమును మనము వినలేము. వస్తుసంఘర్షణ జనిత శబ్దమే వినగలము. మానవముఖమునుండి జనించిన శబ్దమును భాషగా సంగీతముగా విభజించికొని దానియందు రమించుచున్నాము. ప్రతివాడు గాయకు డగుటలేదు. ప్రతివాడు భాషావేత్త యగుట లేదు. ప్రతివాడు కవి యగుటలేదు. ఎందుచేత? ఈ దేశము తత్తత్పూర్వజన్మ సంస్కార విశేష మని సమాధానము చెప్పుచున్నది. పరదేశములు దీనినిగూర్చి యాలోచింపవు. ఆలోచించుట యెరుగవు. వానిగొంతు చీల్చి వాని కంఠనాళములు పరీక్షించి నిర్ణయించుటకు ప్రయత్నించును. లేదా వాని బుఱ్ఱ లోని మెదడులను పరిశీలించును. దానిమార్గము వేఱు. మనమార్గము వేఱు.

మొదట నాకాశము సృష్టింపబడినప్పుడే తద్గతమై సర్వనాద ముండునట్లు సృష్టింపబడినది. సర్వభాషలు సర్వశబ్దములు నచ్చట నున్నవి. లోకము ప్రవర్తిత

మగుచున్నది. ఈరీతిగా 'బహుస్యామ్ ప్రజాయేయ' అని సంకల్పించిన పరమేశ్వరుడు తనకు బహుత్వ మెట్లు వచ్చును? అచ్ఛమై స్వచ్ఛమై యున్న తన మూర్తియందు బహుత్వము వచ్చుట దుర్ఘటము. దానియందు మాయను కల్పించుకొనవలయును. ఆ మాయను కల్పించుకొన్నాడు. బహురూపములను పొందినాడు.

ఒకవిద్య రెండు విధములు. మహాస్త్రములవలె అల్పుడు ప్రయోగింపను మాత్రమే కలడు. అధికు డుపసంహరింపను గలడు. పరమేశ్వరు డా యుపసంహారమును గూర్చి భావించెను—ఏ యొక్క విషయమునుగూర్చి విచారించినను తీగ కదిపినచో డొంక కదలును—పరమార్థ మెట్లు గోచరించును? ప్రయోగోపసంహారముల నడుమ కొంత యున్నది. దాని పేరు మాయ. ఈ మధ్యభాగమంతయు మాయచేత నిండియుండును. అస్త్రము ప్రయోగింప బడినది. కొంత సేపటి కుపసంహరింపబడినది. ఈ నడిమికాలమునందు తత్ప్రయోగ జనిత క్రియాఫల పరిణామము లెక్కగట్టిన వా డెవడు? లెక్కగట్టినచో స్వరూపావబోధము జరుగును. నేను ప్రజలకొఱకు బహుగా నగుదు నన్నాడు పరమేశ్వరుడు. అయినాడు, ఉపసంహరించుటకు కూడ మార్గము చెప్పినాడు. మరల నా యుపమాలంకారమునే తీసికొందము. సర్వప్రయోక్తకు నుపసంహర్తృత్వశక్తి లేదు. ఉపసంహరణశక్తి తపశ్శాలులయందు మాత్రమే యున్నది. బ్రహ్మశిరోనామకాస్త్రము అశ్వత్థామ లిద్దఱును ప్రయోగింపగలరు. అర్జునుడు మాత్రమే ఉపసంహరింపగలడు. అట్లు పరమేశ్వరుడు మాయను గెలుచుటకు నిర్మించిన సాధనము తపశ్శాలులకు మాత్రమే? భగవంతుడు నిర్మించిన మార్గమును తపోబుద్ధిచేత నాచరించిన వానికి మాత్రమే? ఈ రహస్య మిట్లుండగా భగవంతుడు మాయ నుపసంహరించెడి మార్గమును తొలుత చెప్పెను. దాని పేరు వేదము.

ఈ వేదము మానవనిర్మిత మగుటకు వీలులేదు. ఎందుచేత? ఈ వేదము శబ్దము. ఆ యాకాశమునం దున్నది. ఆకాశము సర్వశబ్ద గుణకము. అయినను సర్వమునందు పరమేశ్వరు డున్నట్లే సర్వశబ్దమయమైన యాకాశమునందు వేదమున్నది. వేదము కూడ నున్నది. శబ్దమయమైన జగత్స్వరూపమునందు అంతర్భూతుడై పరమేశ్వరునివలె పరమేశ్వరుదేయైన యా వేద మున్నది. "మంత్రో హీనః స్వరత శ్శబ్దతో వా మిథ్యాప్రయుక్తః న తదర్థ మాహ" కనుక

స్వర వర్ణ హీనమైన మంత్రము మిథ్యాప్రయుక్తము. మంత్రార్థమును చెప్పదు. అనగా స్వరవర్ణములు మంత్రార్థమును చెప్పుచున్నవి. మానవనిర్మితమైన భాష కీ శక్తి లేదు. స్వరము లేదు. వేదము మానవనిర్మిత మగుటకు వీలు లేదు. ఎంత ఋషియైనను స్వరమును నిర్మించునా ? దానియందు పరమేశ్వరు డున్నాడు, ఇది భగవన్నిర్మితమే ! భగవంతుఁడు తన స్వరూపమును తాను చెప్పికొనుటయే లేదా తనస్వరూపమును తాను శబ్దాకృతిగా వెలయించుటయే ! స్వర వర్ణ హీన మంత్రము నకు వేఱే యర్థ మున్నది. అది లౌకికార్థము ; మంత్రార్థము కాదు. ఈ లౌకికార్థజ్ఞాతలకు వేదములోని యర్థము స్వర వర్ణముల యందున్నదని తెలియదు. లౌకికములైన శబ్దముల యర్థములయం దున్న దనుకొనుచున్నారు. తపస్సుచేత పూర్వజన్మ సంస్కారముచేత వైదికమైన శబ్దమునందు విశ్వాసము కలుగుచున్నది. అవి లేనివానికి కలుగుట లేదు.

కర్తయెవఁడు ? పరమేశ్వరుఁడు. ఆ యవిశ్వస్తునిచేత విశ్వసింపచేయుటకు నీవు బ్రహ్మవా ? వాని సంస్కారమును మార్చగలవా ? మఱియెందుకీ ప్రయత్నము. ఇదికూడ పరమేశ్వరుని లీలలో నొక భాగము.

"మంత్రో హీనః స్వరతో వర్ణతో వా" అన్నమాటలో మఱియొక చమత్కార మున్నది. స్వరమున కెంత ప్రాధాన్యమో వర్ణమున కంత ప్రాధాన్య మున్నది. దేవపదము వేదపదము రెండు నొక్కటియే ! 'అప్యేకం దేవపద మధీయాత' (పే 27) ఈ మంత్రము రెండు నొక్కటియే యని చెప్పుచున్నది కదా ! ప్రకాశించునది దేవుడు. బుద్ధియందు వెలుగువాఁడు. వర్ణవ్యత్యయము మాత్రమే యిక్కడ జరిగినది. కనుక వేదము ప్రకాశించినది. మహర్షుల బుద్ధికి భాసించినది.

మఱియు నగ్ని యన్న శబ్ద మున్నది. "అగ్ని మీళే పురోహితమ్". వేదములో నున్న రహస్య మేమనగా మనము సమన్వయించుకొనవలయును. బహు ప్రదేశములయందు ప్రయోగింపబడిన వేదాగ్న్యాదిశబ్దములు నొక్క మహారహస్య మునే సర్వమును చెప్పును (పే. 20). ఇది మన మనస్సులలో ప్రకాశింపవలయును. అది వేదమునకు వేదత్వము. ఈ రీతిగా మాయాపిహితమైన యీ జీవకోటి తిరిగి స్వస్వరూపానుసంధానము చేసికొనుట కొఱకు పరమేశ్వరోద్దిష్టమై యాకాశము

నందు వేదము శబ్దమయమై యున్నది. భిన్నకల్పములయందు ప్రథమర్షులకు నా వేదములు బుద్ధియందు ప్రకాశించి వాగ్రూపమున వచ్చును.

ఋషులు మానవు లను పొరపాటు పడకూడదు, వారు ద్రష్టలు, దర్శన మనగా ఆకాశము నందున్న శబ్దమును వినుట. దానిని చూచుట; వినుటయు చూచుటయు రెండును నేకార్థకములు. తాత్పర్యతః తెలిసికొనుట యని యర్థము ఈ ఋషులనుండి వేద ముత్పన్నమైన యట్లు కనిపించును. అది యెట్లుత్పన్న మయినది? వాని యర్థ మేమి? ఇది విచార్యము. "హృద్యాత్ సముద్రాత్ శతవ్రజా ఏతా అర్షన్తి" ఆ వేద మిట్లు వచ్చినది. హృద్యమై వచ్చినది (పే.49

ఈ గ్రంథకర్తలు హృద్య మన్న శబ్దమునకు నిగమ నిరుక్త నిఘంటు వ్యాకరణ శిక్షా ఛందస్సులచే దోషరహిత మగుట యర్థముగా వ్రాసిరి. ఎంతో బాగుగా నున్నది, స్వంతముగా వ్రాసినచో మఱియు ప్రశంసనీయముగా నున్నది.

"రిషుణా నావచక్షే" దీనికి శత్రువులవలన భయములేదు-అని వేదమే చెప్పికొనుచున్నది. ఇది ఋగ్వేదము లోనిది. పరమేశ్వర సంకల్పితమైన 'బహుస్యామ్ ప్రజాయేయ' లో నుండి ఉత్పన్నమైన ఆకాశమునందు నిత్యమైయున్న ఈ వేదము నకు భయ మేమున్నది? వేదశబ్దమునకు బహ్వర్థములు చెప్పబడినట్లే యన్ని యర్థములకు నైక్యము నిరూపింపబడినట్లే వేదాభిముఖ్యము ప్రతిపాదింపబడినట్లే యీ నిరుక్తియందున్న సర్వశబ్దముల యర్థ వివరణ నిరూపణములు ప్రవర్తిల్ల జేయ బడినవి. ఋషిశబ్ద మట్లే చేయబడినది 'శతవ్రజా' అన్న శబ్దము విష్వగ్గతిగా నిరూపింపబడినది.

వీరు కొన్నిచోట్ల కొన్ని శబ్దములకు దురర్థమును నివారించుచు వచ్చిరి. అందులో నొకటి 'మంత్రకృత్' అన్న శబ్దము, ఈ శబ్దమునకు మంత్రకర్త యని యర్థము చెప్పరాదు. వేదము అనాది కదా! మఱియు నెప్పటనైన భాష్యములలో గాని వ్యాఖ్యానములలో గాని తాత్పర్యావబోధనము కొఱకు చెప్పిన పంక్తులు విరోధులు తమ దుష్టార్థమును నిరూపించు కొనుటకు సాయపరచుకొన్నచో వానిని నివారించుటయు వీరు చేసిరి. "హృదా యత్ తష్టా మంత్రాగ్ం అశంసన్" ఇచట

సాయణులవ్యాఖ్య కొంత పరుల కుపయోగించునట్లుండెను. ఇది "హృదా తష్టేషు మనసో జవేషు" అన్నచోటి సాయణభాష్యముతో నివారితమైనది (పే. 61; 635)

ఋషిశబ్దము వేదమున కన్వయించును. పూర్వఋషుల కన్వయించును. భిన్నస్థలములయందు దాని యన్వయమును వైదికుడు చూచికొనవలయును. దీనినే దుర్గాచార్యలు "శాస్త్రారంభ ప్రయోజన ద్వారేణార్థవత్తావధారణమ్" అని చెప్పినది. ఇచ్చట శాస్త్ర మనగా వేదపంక్తు లనియు నర్థము.

ఇట్లుండగా ఋషులు తా మొక తన్మయత్వస్థితిలో నుండి ఆకాశగత శబ్దమయమైన వేదమును దర్శించిరి. ఒక యావేశము పొంది రని చెప్పరాదు. ఒక తన్మయత్వ స్థితిలో నుండి రని చెప్పరాదు. చెప్పినచో నష్ట మేమి? తన్మయత యనగా ఆనందమయత వంటి శబ్దము. "ఆనందమయోఽభ్యాసాత్" వలె. అక్కడ ప్రాచుర్యార్థము కావచ్చును. ఈ ఋషుల విషయములో వికారార్థము చెప్పరాదు. త్రాగి తందనము లాడు వాడు కూడ నొక తన్మయత్వములో లేడనుటకు వీలులేదు. కనుక నిక్కడ తచ్ఛబ్దార్థ నిరూపణము చేసికొనవలయును. చారిత్రికులు చేసికొన లేదు; బాధపడుచున్నారు. కవుల తన్మయత్వము వేఱు. ఋషుల తన్మయత్వము వేఱు. కవుల తన్మయత్వము కొస ఆకులు మేసెడి తన్మయత్వము; కొండకొమ్మున వెనుకకాళ్ళమీద నిలుచుండి తీగయొక్క చివళ్ళు మేసెడి మేకయొక్క తన్మయత్వము.

వేదమునందు శబ్దార్థనిర్ణయమునకు తీసికొనవలసిన విషయములు వేఱు. పాశ్చాత్యులు వారి సాహిత్యములోవలె పలుచోట్ల ప్రయోగింపబడిన పద్ధతులను జూచి వేదశబ్దార్థ నిర్ణయము చేయుటవలన వారికి వేదార్థము తెలియలేదు. వారికి తెలియదు. తెలియకపోవుటకూడ గుణ మనుకొన్నచో నెవ రేమి చేయగలరు? వేదార్థము తెలియుటకు గుర్వనుగ్రహమును దేవతానుగ్రహమును కావలెను. అవి రెండును కలిగి నప్పుడే యర్థము తెలియును. దానిని శక్తిపాత మందురు. ఈ శక్తిపాతము జరుగుటకు యోగ్యమైన లక్షణములు పాశ్చాత్యులయందు లేవు. ఉండుటకు వారిజాతిలో నా లక్షణము లేదు. వారి నాగరికత యట్లు పెంపొందలేదు. దాని కెవ రేమి చేయగలరు? దీనిని మనవారు సంప్రదాయ మందురు. వారు

సంప్రదాయమును నిరసింతురు. నిరసించుట ఒక గుణముగా భావింతురు ఇంగ్లీషుభాషలో చెప్పినట్లు ఒకటి యుత్తరధ్రువము; ఒకటి దక్షిణధ్రువము.

వేదమునకు ప్రతిష్ఠ యని పేరు. ఈ శబ్దమునకీ యర్థ మెట్లు వచ్చినది. ప్రతిష్ఠ యనగా నేమి? సంప్రదాయము, ప్రతిష్ఠ, శక్తిపాతము, ఆమ్నాయము, అనుశ్రవము-ఈ శబ్దము లన్నియు ఏకార్థకములవలె నున్నవి. వీనిని తెలిసికొనరాదు. "ద్యులోకా దుదీయమానా పురాతనీ"—ఇది రహస్యము (పే. 155).

వేదమునం దన్నిశబ్దములు సంప్రదాయము ప్రకారము చూడకపోయినచో నర్థము కావు. సాయణాదులకంటె పాశ్చాత్యులు ప్రముఖు లని, వారు ప్రమాణమని యనుకొనుట మూలచ్ఛేదకమైన విషయము. దీనిని నా వేయిపడగలలో పూర్వము వ్రాసితిని. ఇట్లు పాశ్చాత్యుల మనోవ్యాధివలన వేదార్థములు తాఱుమాఱు చేయబడినవి. నవశబ్దము, స్తోత్రశబ్దము, ఆమ్నాయ, అనువాక-ఇత్యాద్యనేక శబ్దములు సంప్రదాయము ననుసరింపక పోయినచో నవి సరియైన యర్థము నీయవు,

మరియు వేదాధ్యయన మనగా కృత్స్నవేదాధ్యయనమా? ఎవనికి పఠిన వానికి ఆత్మీయశాఖా వేదాధ్యయనము మాత్రమేనా? అన్నవిషయముమీద వీరు చాల ప్రపంచించి వ్రాసిరి. కృత్స్నవేదాధ్యయనమునకు ఛందోలోకము లక్ష్యము. ఛందోలోక మనగా బ్రహ్మలోకము. ఇందులో స్వశాఖాధ్యయన మందము. వేదమునందు 'స్వ'శబ్ద మొక యాశ్చర్యకరమైన శబ్దము. తచ్ఛబ్దార్థ నిరూపణము జరిగిన గాని పలువిషయములు తేటతెల్లములు కావు. ఈ శబ్దము 'స్వాహా' అన్న శబ్దములో కనిపించుచున్నది. "స్వావ్యయః" అన్న శబ్ద మున్నది (247.8). ఈ శబ్దము తనయందు అవ్యయము అన్న యర్థ మిచ్చును. ఈ అవ్యయ శబ్దమే వేదమునందు విలక్షణమైనది. ఉపనిషత్తులయందు భగవత్పాదులయొక్క భాష్యమునందు దీని రహస్యము వెల్లడి యగును. స్వావ్యయ మన్న శబ్దము ప్రత్యక్షనామము. స్వప్న మన్నది పరోక్షనామము. ఎవరికి? ప్రాణశబ్దవాచ్యుడైన పరమేశ్వరునకు. ఈ స్వప్నశబ్ద రహస్యము తెలియవలయు నన్నచో మాండుక్యోపనిషత్తు చదువవలయును. స్వాహాశబ్ద మున్నది. ఇందులో స్వ - అహ అన్న రెండుశబ్దము లున్నవి. ఈ అహ, అహుతి - అహూతి - అహితి - మొదలైన

శబ్దములకు స్థావరమైనది. ఈ వేదవాక్యము చక్కగా పరిశీలించినచో సర్వము కరతలామలక మగును (పే. 255).

"ప్రజాపతి రగ్ని మసృజత। తం ప్రజా అన్వసృజ్యన్త।
త మభాగ ఉపాస్త। సోఽస్య ప్రజాభి రపాక్రామత్।
తమవరురుత్సమానోఽన్వైత్। త మవరుధ న్నాశక్నోత్।
స తపోఽతప్యత। సోఽగ్ని రుపారమతాతాపివై స్య ప్రజాపతి రితి।
స రరాటా దుదమృష్ట।

ఉద్ఘృత మభవత్। .......త దగ్నౌ ప్రాగృహ్ణాత్। తద్వ్యచికిత్సత్।
జుహవానీ౩ మాహౌషా౩ మితి। తద్విచికిత్సాయై జన్మ. ఇతి।
య ఏవం విద్వాన్ విచికిత్సతి। వసీయ ఏవ చేతయతే ఇతి। తం
వా గభ్యవద జుహుధీతి। సోఽబ్రవీత్। క స్త్వ మసీతి। స్వైవ
తే వాక్ ఇత్యబ్రవీత్। సోఽ జుహోత్ స్వాహేతి।" — ఇది యొకటి.

మఱియొక చమత్కారము. ఇది నిఘంటువ్యాఖ్య లోనిది. ఆ వాక్కు సరస్వతి యని యర్థము. దేవరాజ యజ్వయొక్క వ్యాఖ్యాన మిట్లున్నది. స్వయం సరస్వతీ ఆహ బ్రూతే। స్వైవ తే వాక్ ఇత్యబ్రవీత్ ఇతి బ్రాహ్మణమ్" ఈ యర్థమునే శతపథ బ్రాహ్మణము కూడ ననుసరించుచున్నది; దీని విషయమును విచారింతము, ప్రజాపతి స్వాహా అన్న శబ్దముతో హోమము చేసెను. దీని పద విభాగము. స్వ + ఆహ. ప్రజాపతియొక్క వాక్కే అట్లు వినబడిన దని. "తే - నీ యొక్క" - అన్న శబ్దముచేత ఆ యర్థము వచ్చుచున్నది కదా! ఈ 'స్వ'కారమే సరస్వతిగా శతపథము చెప్పుచున్నది. ఈ సరస్వతి యనగా నెట్టిది? ఇది ప్రాణ శక్తి మూలకము. మూలాధార చక్రమునందలి ఆకాశమందు ప్రాణములయొక్క సంచలనాత్మక మైనది సరస్వతి. ప్రాణము అనగా పరమేశ్వరుడు. తాత్పర్య మే మగుచున్నది? నేను తొలుత చెప్పిన, సర్వథా వేదము ప్రతిపాదించుచున్న పరమే శ్వరీ మహిమవలన బ్రహ్మనుండి సముత్పన్నమైన యాకాశమునందు నిండియున్న ప్రాణము అనగా వాయువు అది 'బహుస్యామ్ ప్రజాయేయ' యన్న ప్రజాపతియొక్క సంకల్పముయొక్క పరమార్థము. ఈ మహా సర్వైకాత్మకమైన పరమేశ్వరు డన్న మహాపురుషునియొక్క అభివ్యక్తచిహ్న మైన మానవునియందు సర్వము లేశతః లేశతః

అనుస్యూతమై అంతయు నొకటియే యై యున్నది. ఇది వేదముయొక్క రహస్యము. ఈ రహస్యమును తెలియనివారు వేదమును పఠించి యెక్కువ లాభము లేదు, అధిగత తద్రహస్యులైన మహాపురుషులయొక్క యనుష్ఠానము తత్ప్రాప్తిహేతు వగును.

ఈ మహాగ్రంథ మంతయు సర్వత్ర యున్నట్టి బహుశబ్దములను ప్రోవుచేసి వాని సంయోజనమును వివరించుచున్నది. స్థూలముగా జూచినచో భిన్న శబ్దములయొక్క యర్థమును నిర్ణయించినట్లు కన్పించును. 'ఏకేన విజ్ఞాతేన సర్వం విజ్ఞాతం భవతి' - అన్న ఉపనిషద్వాక్యముయొక్క యర్థ మిదియే.

ఇట్లుండగా రెండు మూడు పెద్ద పేచీలు గలవు. యజ్ఞయాగాది క్రతు కార్యములవలన మోక్షము రాదని వానికి స్వర్గాది ఫల మున్నదని యొకటి-అనుష్ఠాన విరహితమై బ్రహ్మలోకప్రాప్తి జరుగవచ్చునని. ఈరెండును కొంత మిథ్యా వాదములు. స్థూలముగా జూచినచో జగద్గురువులైన ఆదిశంకరుల వాక్యమునకే వ్యతిరేకముగా నున్నట్లు కనిపించును. కాని ఆదిశంకరులు చెప్పిన ఈ శ్లోకార్థమును శ్లోకమును సర్వ విద్వద్విదితములు—నరజన్మ దుర్లభము; అప్పుడు పుంస్త్వము, విప్రత్వము; అప్పుడు వేదవేదాంగ పరిజ్ఞానము. తరువాత వైరాగ్యోపరతి మొదలైనదిగా శంకరులే చెప్పిరి కదా! లోకమునందు పలుమంది కొక భ్రాంతి కలదు. "అహం బ్రహ్మాస్మి" భావన బహుసులభ మని. మఱియు లోకమునందు పలుమంది యోగులుగా సిద్ధులుగా కనిపించుచున్నారు. యోగములు సిద్ధులును బ్రహ్మప్రాపకములు కావు. వైయాసికియందు జైమిన్యాదులు చెప్పిన మోక్షమునకు వ్యాసోద్దిష్టమైన మోక్షమునకు భేద మున్నది. దాని నాదిశంకరులు సమన్వయపఱచినారు. మహాప్రళయాంతమునం దా యా జీవులు తత్తల్లోకము లందుండి చివరకు బ్రహ్మైక్యము పొందుదు రని. ఇది మఱల విచారణీయమైన అంశము. ఆ విభేద మెందు కున్నది? విభేదము విభేదము కాదా?

పరమార్థముగా నొక్క మాట చెప్పవలయును. ఇంత తేలికగా బ్రహ్మప్రాప్తి కలిగినచో పరమేశ్వరుడు వేదములను చెప్పుట యెందులకు? యజ్ఞయాగాది కర్మల నుపదేశించుట యెందులకు? ఒకానొకనికి పూర్వజన్మలయం దున్న మహాసుకృతవశమున బ్రహ్మభూయుడై జన్మించుట కలిగినచో నది వేరాను

ష్ఠానము యొక్క నిరసనము కాదు. త్రయీవిద్యా నిరపేక్షక మైనది బ్రహ్మవిద్య కానే కాకూడదు. అది పరమేశ్వరోద్దేశము, దీనిని గురించి పండితులు చాల విచారింపవచ్చును. వేదమును పరిత్యజించి మోక్షము లేదు. యజ్ఞ యాగాది క్రతువులను పరిహరించి యచ్చమైన బ్రహ్మప్రాప్తి కలుగనేరదు; ఉపాసనాదులు తత్తల్లోక ప్రాపకములు. అచ్చమైన బ్రహ్మప్రాపకము వేద మొక్కటియే.

బ్రహ్మ జయతి। వేదో జయతి।

ఈ గ్రంథము సంప్రదాయబుద్ధులకు, వేదమతులకు, శబ్ద యథార్థార్థ జిజ్ఞాసువులకు కరతలామలకము గా నున్న దని చెప్పవలయును. ఆ దృష్టితో గ్రంథము చిన్నది. విచారింపబడిన శబ్దముల సంఖ్య కొద్ది. కాని 'ఏకేనైవ విజ్ఞాతేన సర్వమ్ విజ్ఞాతం భవతి'.

ఈ గ్రంథకర్తలకు నమస్కారములు.

అస్మద్గురువులు వేదాంతభాస్కరులు శ్రీ కుప్పా లక్ష్మావధానులు గారికి నమస్కారములు.

శ్రీ జగద్గురువులు నేటి శ్రీకాంచీ కామకోటి పీఠాధిపతులకు నమస్కారములు చాలవు కదా. వారి యనుగ్రహమును నేను వాంఛించుచున్నాను. వారి యాశీస్సులు నా జీవలక్షణమునందు నిండి యుండు గాక! అయోగ్యుడైన నాచేత నిది వ్రాయించిన నాలోని యొకానొక యుద్రేకమును నేన నిందించుకొనుచున్నాను.

విజయవాడ

8—12—71

విశ్వనాథ సత్యనారాయణ

# పండితాభిప్రాయములు

## అవధానిశిరోమణి శ్రీ కాశీ కృష్ణాచార్యులుగారు

శ్రీ లక్ష్మీహయగ్రీవో విజయతేతరామ్. ఆశీరాద్యుపరి. అమూల్య మగు మీ 'భారతీనిరుక్తి'ని మీ ముఖముననే ప్రత్యక్షర పరిశీలనా పద్ధతితో వినుటచే నాకు శ్రమ యించుకేనియు గలుగకుండ సర్వవిషయములును నాకు బోధపడినవి. ఈ గ్రంథమున మీరు వ్రాసిన ప్రతివిషయమును అపౌరుషేయ శ్రుతిమూలక ప్రామాణ్యము గల దగుటచే నందఱకును శిరసా శ్లాఘనీయమై యొప్పుచున్నది. సర్వభాషామాతృ భాష యగు దేవభాష (సంస్కృతభాష) యొక్క ప్రాశస్త్యము దెలియవలయు నన్న మీ గ్రంథముకంటె నుత్కృష్టతర మగు మఱియొక గ్రంథము పూర్వకాలమందు గాని యుత్తరకాలమందు గాని యుండియుండదు. ఈ గ్రంథమును మీరు మృదుమధురమై నిర్దుష్ట మగు చక్కని సులభాంధ్రభాషలో వాక్యరూపమున వ్రాయుటచే భారతీయాంధ్రులకు కింతంత యని చెప్ప నలవి కాని మహోపకారము చేయుట కీ భారతీనిరుక్తి చాలి యున్నది.

శ్లో॥ హే ధారాపురనాథ భోజనృపతే హే విక్రమార్కప్రభో। హే వల్మీకతనూభవాదిమకవే హే కాళిదాసాధునా। కిం యూయం సురభారతీం క్షితితలే త్యక్త్వైవ యాతా దివం। నోచేత్ తత్సహితా గతా ! వదత నః స్వప్నేఽథవా క్వాస్తి సా॥ అను శ్లోకమున సురభారతియొక్క నేటి వైరళ్యమునకు నా మనంబున గల సంతాపము తమ కెల్లరకును గోచరించును. మన భారతీయులు పరదేశ భాషాద్యనుకరణాతితృష్ణులై స్వభాషామహిమను గనలేక మాతృభాషాదరమును జూపని వా రగుటచే గదా, సంస్కృతమున కీ నాడు ప్రచారము తగ్గిపోయిన దని నా విచారము. సంస్కృతభాషాజ్ఞానము లేని యెడ దాని యుత్కృష్టత దెలియ వీలులేదు. దాని యుత్కృష్టత దెలిసిన గాని భాషాజ్ఞానమును సంపాదింప గోరరు. కావున నిట్లన్యోన్యాశ్రయదోషము చేత గదా భాషాయోషయొక్క అంతర్ధానము గల్గినది ; ఇక నీ దోషము పోయి యందఱకును నీ భాషామహిమ యెట్లు బోధపడును స్వామీ ?—

యని నేను విచారపడుసమయమున నమూల్య మగు మీ గ్రంథము వెల్వడి నాకు గొంత యుత్సాహమును గల్పించి నా విచారమును దొలగించినది. ఈ గ్రంథ మచిరకాలమున ముద్రితమై ప్రతి భారతీయాంధ్రుని హస్తము నెపు డలంకరించునా ? యని యువ్విళ్లూరుచుంటిని.

శ్లో॥ మాతా చ మాతృభాషా చ మాతృభూమి శ్చ సర్వదా। చతుర్వర్గ ఫలా వాప్త్యై సంసేవ్యాః సర్వమానవైః॥ - అని నా హృదయాభిప్రాయము. జ్ఞాన విజ్ఞాన సర్వస్వము నొసగు భాష యేదియో యదియే అమృతభాష కాగలదు. అది యొక సంస్కృతమే. శ్లో॥ అంగాని వేదా శ్చత్వారో మీమాంసా న్యాయవిస్తరః। పురాణం ధర్మశాస్త్రం చ విద్యా హ్యేతా శ్చతుర్దశ॥ — ఈ చతుర్దశ విద్యలను గడుపున నిముడ్చుకొన్న భాష యొక సంస్కృతమే; శ్లో॥ మోక్షే ధీ ర్జ్ఞాన మన్యత్ర విజ్ఞానం శిల్పశాస్త్రయోః - అను శ్లోకము ప్రకారము మానవున కైహికా ముష్మికానందము నీయ జాలిన దీ సంస్కృతభాషయే. మఱియొక భాష కిట్టి సామర్థ్యము లేదు.

కావున సంస్కృతమహిమను జక్కగ దెలుపగల మీ భారతీనిరుక్తిని శీఘ్రముగ ముద్రించి భారతదేశమున వ్యాపింప జేసి మఱల అర్థకశక్తి ముఖ్యార్థభూతు లగు భారతీయుల నున్నతస్థితి లోనికి దెచ్చుటకు మీరే మొదట దారితీసినవారని నే దలచితిని. ఇట్టి గ్రంథములనే మఱికొన్నిటిని భగవంతుడు మీచే రచింప జేసి భారతదేశము నుద్ధరించును గాక యనియు, అందుకు వలయు శరీరారోగ్యాది సంపదను భగవంతుడు మీ కొసంగు గాత మనియు నే నాసింతును.

గుంటూరు
10—1—47

ఇత్యాశిషః
(సం) కాశీ కృష్ణాచా[illegible]

## కళాప్రపూర్ణ, శతావధాని,

# శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు

శ్రీమత్పరదేవతాయై నమః - భారతీనిరుక్తి - ఇయ్యది చతుర్వేదముల యందలి వాక్యములను, తత్తద్భాష్యములను క్వాచిత్కముగ స్మృతివాక్యాదులను తఱచి యాస్కాచార్య నిరుక్తమునకు ఛాయగా విరచించిన యమూల్య మైన వైదికగ్రంథము. దీని రచనకు గ్రంథకర్తలు చేసిన పరిశ్రమ చాల వర్ణనీయము. షడ్దర్శనములలో నేది గాని యిందు కొంచెము గొప్ప తగులక పోలేదు. ఇందు నూటికి తొంబది వంతులు యౌగికార్థములే నిర్వచింపబడి యుండుటచే లోకములోని సాహిత్యమున కిది విశేషించి తోడ్పడను. వ్రాయబూనినది వేదమునకు సంబంధించిన విషయ మైనప్పుడు లౌకికసాహిత్యమున కుపకరించు నెడల గ్రంథకర్త యుద్యమమున కన్యథాత్వమే సంభవించును. కావున నిది వైదిక సాహిత్య పోషక మగుటయే సమంజసము. ప్రధానముగా వైదికమున కుపకరించుచు నా సంస్కారము లౌకికమునకు గూడ (దేహళీ దత్త దీప న్యాయేన) నుపకరించు ననుటలో విప్రతిపత్తి యేకొంచెము నుండదు. అనేక నూతనవిషయములు దీనిలో గ్రంథకర్త లిమిడ్చి యుండుటచే గురుశుశ్రూష లేకయే జిజ్ఞాసువు లెన్నో రహస్యములను దెలిసికొని కృతార్థు లగుట నిర్వివాదాంశము. విద్యాభ్యాసమునకు నావశ్యకము లైన సాధనద్వయములో నిది రెండవది యని నా నిశ్చితాభిప్రాయము.

యాస్కాచార్యులు భరతశబ్దమునకు సూర్యు డని నిర్వచనము (భరతః సూర్యః తస్య స్వభూతా దీప్తి ర్భారతీ) చూపెను. భారతీయదీప్తి యని కూడ పరినిష్ఠితార్థము చెప్పికోవచ్చును. అపుడు భారతీయ శబ్దము తద్ధితవృత్తిగా గాక కృద్వృత్తిగా (భారతీం యాన్తి జానన్తి. యే గత్యర్థా స్తే జ్ఞానార్థాః) వ్యాకరించినచో భారతీ సర్వస్వ విజ్ఞానము దీనివలన లభించు నని కూడ పరిణమించును. ముఖే ముఖే సరస్వతీ. కనుక సహృదయు లనేకార్థము లిందు వ్యాకరింతురు గాక.

విజయవాడ
9-1-11947

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి

## వేదభాష్య విశారద

## ఉప్పులూరి గణపతి శాస్త్రి గారు

భారతీనిరుక్తి యను నీ గ్రంథరాజమును స్థాలీపులాక న్యాయముగ కొంచెము రుచి చూచుటయే కాని సమగ్రముగ వినియెడి భాగ్యము లభింపలేదు. కాని యీ గ్రంథరత్నము అనాదినుండియు మన పూర్వులచే వ్యవహరింపబడెడి సంస్కృత వాఙ్మయమును అన్వర్థమని (ఆస్తిక నాస్తిక సాధారణముగ) అంగీకరించునటుల ననేకము లగు గ్రంథరాజముల నుండి ప్రమాణ వచనముల జూపుచు ననేక (రహస్య) గుప్త భావములను వ్యక్తీకరించుచు, ప్రాచీనుల సంప్రదాయమును లోక మంతటను చాటుచు, పండిత పామర సాధారణముగ మహోపకారక మనుటలో నతిశయోక్తి గానరాదు. వేయేల? అనేకులగు కవిపుంగవులు తమ వైదుష్యమును వర్ణనాచాతుర్యముచే లోకమున ప్రకటించి కృతప్రతిష్ఠులై విరాజమానులగుచు గానవచ్చుచుండిరి కాని సర్వజనోపకారకములగు ప్రాచీన సంప్రదాయ విశేషముల నీ విధముగ ప్రమాణవచనోల్లేఖ పురస్సరముగ వివరించి సహృదయ హృదయాహ్లాదకరంబై మహోపకారమును గావించు గ్రంథమతల్లికను రచించు విద్వద్వర్యులు విరళులైరి. ప్రకృతములో నీ గ్రంథరాజమును శీఘ్రకాలములో ముద్రింపించి ప్రాచీన సంప్రదాయ జ్యోత్స్నాంకురములచే నాస్తిక హృదయ తమిస్రము పారద్రోలి లోకోపకారమును గావింపవలె నని యాశించుచున్నాను.

కాకినాడ
17—6—1947

(సం) ఉప్పులూరి గణపతిశాస్త్రి

# శ్రీ కుప్పా శ్రీ ఆంజనేయశాస్త్రి గారు

"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం। యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై"—అని శ్రుతివచనము. 'యో వేదేభ్యోఽఖిలం జగత్। నిర్మమే'—అని స్మృతివచనము, వేదార్థోపబృంహకము లగు పురాణములలో మార్కండేయ పురాణమున (16 అధ్యాయమున) శ్లో॥ సర్వస్యాధార భూతేయం వత్స! ధేను స్త్రయీమయీ। యస్యాం ప్రతిష్ఠితం విశ్వం విశ్వహేతు శ్చ యా మతా॥ ఋక్పృష్ఠాఽసౌ యజు ర్మధ్యా సామవక్త్రి శిరోధరా। ఇష్టాపూర్త విషాణా చ సాధుసూక్త తనూరుహా। శాన్తి పుష్టి శకృ న్మూత్రా వర్ణ పాద ప్రతిష్ఠితా। ఆజీవ్యమానా జగతాం సాఽక్షయా నాఽపచీయతే। స్వాహాకార స్స్వధాకారౌ వషట్కార శ్చ పుత్రిక। హన్తకార స్తథా చాఽన్యః తస్యా స్తనచతుష్టయం। స్వాహాకారం స్తనం దేవాః పితర శ్చ స్వధామయం। మునయ శ్చ వషట్కారం దేవభూత సురేతరాః। హన్తకారం మనుష్యా శ్చ పిబంతి సతతం స్తనం। ఏవ మాప్యాయయ త్యేషా వత్స! ధేను స్త్రయీమయీ। తేషా ముచ్ఛేదకర్తా చ యో నరోఽత్యన్తపాపకృత్। పాయయ త్యుచితే కాలే స స్వర్గాయోపపద్యతే। తస్మాత్ పుత్ర మనుష్యేణ దేవర్షి పితృ మానవాః। భూతాని చాఽనుదివసం పోష్యాణి స్వతను ర్యథా - యని చతుర్వేద రూపిణియు త్రయీమయియు నగు వాగ్ధేనువు వర్ణింపబడినది.

శ్రీమన్నారాయణుని నాభికమలమునుండి యావిర్భవించిన బ్రహ్మకు తానేమి చేయవలయునో స్ఫురింపకయుండ 'తప' (తపమొనరింపుము); 'సృజ' (సృష్టి చేయుము) - అను శబ్దములు వినంబడెను. ఆ సృష్టి యెట్లొనరింపవలయునో స్ఫురింపక మరల వ్యథ నందుచుండ పరమాత్మచే వేదము లుపదేశింపబడినవి. (శ్రీమద్భాగవతము - తేనే బ్రహ్మ హృదా య ఆదికవయే) అంత నా వేదరాశి నాధారముగ గైకొని పరమేష్ఠి బ్రహ్మాండమును సృజించెను. కాగా - సమస్త బ్రహ్మాండ సృష్టిక్రమమును బోధించునది వేదరాశి యని ప్రస్ఫుట మగుచున్నది. సృష్టిక్రమమునందే సృష్టపదార్థ రక్షణోపాయ మిమిడి యుంట విజ్ఞజనవిదితము. కాననే పైనుదహరింపబడిన మార్కండేయపురాణమందు వేదరాశి యొక ధేనువుగ

రూపింపబడి సృష్టము లైన ప్రాణికోటి నంతను ఆ త్రయీకామధేనువే యాప్యాయత నొందించుచున్నది యని స్పష్టముగ వివరింపబడినది.

ఈ విషయమున ననేకార్షగ్రంథ సాహాయ్యముతో సాకల్యముగ బరిశీలించి తత్త్వమును సంపూర్ణముగ గ్రహించి చిరంజీవులగు శ్రీ హరిసోదరులు 'భారతీనిరుక్తి' యను నీ యుద్గ్రంథమును లోకోపకారప్రవణులై రచియించి ప్రకటించినారు. నిరుక్తి యనగా 'ప్రకృతిప్రత్యయ విభాగాది పురఃసరముగ శబ్దముల తత్త్వార్థముల నిరూపించుట'—యని యర్థము. గైర్వాణవాణి యందలి పదజాల మంతయు వ్యుత్పన్నమును, స్వాభిధేయ-స్వరూప-స్వభావ-శక్తి-ప్రయోజనాదుల స్ఫుటముగ స్ఫురింప జేయు నదియే.

ఈ దైవవాణీ స్వాభావ్యమును గుర్తించి, వేదపర్యాయపదముల నిరుక్తిని సబహుప్రమాణముగా సనిర్దుష్టయుక్తికముగ నిరూపించుచు జార్మితికుల స్వోహ కల్పిత వేదపౌరుషేయతా ద్యపసిద్ధాన్తముల సయుక్తికముగ సప్రమాణముగ ఖండించుచు, నద్దాన నిటీవల జార్మితిక దురూహా కల్పిత యుక్త్యాభాసమూలాప సిద్ధాంతాభాసలచే జనించిన యాధునికాస్తికజన మనోవ్యాకులతాది కాలుష్యముల సమూలముగ నిర్మూలించుట యిందు నత్యావశ్యకవిశేషము. ఈ యుద్గ్రంథ రచయితలు చిరంజీవులు నగు హరిసోదరులను ఆ త్రయీకామధేనువు చిరాయు రారోగ్యా దీతోధిక శ్రేయోఽభివృద్ధుల ననుగ్రహించి మనుచు గాత.

మచిలీపట్టణము, 20-9-1971. } (సం.) కుప్పా శ్రీ ఆంజనేయశాస్త్రి.

# స్వధర్మ స్వారాజ్య సంఘము, సికింద్రాబాదు.

ఉభయమీమాంసావిశారద

## శ్రీ వీరేశ్వర కృష్ణ డోంగరే శాస్త్రిగారు.

సాంగ స్వాధ్యాయ భాస్కర

## శ్రీ సన్నిధానం లక్ష్మీనారాయణమూర్తి గారు

*

## భారతీనిరుక్తి గ్రంథాభినందనము

భారతీనిరుక్తి యను గ్రంథమును శ్రీయుతులు హరిసోదరులు గ్రథనము జేసి యున్నారు. భారతీనిరుక్తి యనగా వేద - వేదప్రతిపాద్యార్థముల నిర్వచన మని 'అవతారిక'లో గ్రంథకర్తలే చెప్పియున్నారు.

వైదికధర్మమునకు మూలప్రమాణ మగు వేదము—అనాదిసిద్ధ మైనది. పురుషప్రణీతము కాదు—అని శాస్త్రములు నిర్ణయించినవి. శాస్త్రపురాణేతిహాసాది గ్రంథప్రవర్తకు లగు ఋషులుకూడ చాలమంది యీ సిద్ధాన్తమునే అవలంబించి యున్నారు.

ఈ సిద్ధాంతమునందు శ్రద్ధలేని కొందఱు ఆధునిక చరిత్రకారులు వైదిక వాఙ్మయము పురుషప్రణీత మనియు, అందలి వేఱ్వేఱు భాగములు వేఱ్వేఱు కాలములలో రచింపబడినవనియు. అందును ఋగ్వేద మతిప్రాచీన మనియు, పిదప క్రమముగ నితరవేదములు బ్రాహ్మణారణ్యకాది గ్రంథములు బయలుదేరిన వనియు, కొన్ని యూహలను జేసినారు. ఇట్టి యూహామూలక మైన చారిత్రికగ్రంథములు ప్రస్తుతకాలమున విశ్వవిద్యాలయాదులయందు ప్రధానపాఠ్యగ్రంథము లగుటచే, అనాదిసిద్ధముగ భారతీయులకు వేదమునం దుండెడి శ్రద్ధ తగ్గిపోయి దానిమూలమున వైదికధర్మము యొక్క మూలస్తంభమునకే ఆఘాత మేర్పడినది. ఇట్టి ఆధునికవాదములను సమంజసములగు ప్రమాణములతో ఖండించి ఋష్యాది సమ్మత మైన వేదవాఙ్మయముయొక్క విశిష్టతను అవసర మైనంత వేగముతో భారతీయవిద్వాంసులు స్థాపించుటకు పూను

కొనుట లేదు. ఇట్టిస్థితిని గమనించి మానసికక్లేశము ననుభవించుచున్న హరి సోదరులు గావించిన యీ గ్రంథరచనాప్రయత్నము భారతీయు లందఱికిని అభినంద నీయము, అత్యావశ్యకము నయి యున్నది.

యుగాంతేఽన్తర్హితాన్ వేదాన్ సేతిహాసాన్ మహర్షయః।
లేభిరే తపసా పూర్వ మనుజ్ఞాతాః స్వయంభువా॥

అను సిద్ధాంతమును సమర్థించుట కనేక గ్రంథపరిశీలనము చేసి, ముఖ్యముగ వేదము, ఋషి, బ్రహ్మ మొదలగు కొన్ని శబ్దముల నుదాహరించి వ్యాకరణ నిరుక్తాది ప్రమాణగ్రంథముల యాధారముతో వాని యర్థమును విశదీకరించుచు, నిట్టి యర్థముల నిచ్చు పదములను వేదగ్రంథములందు వేదమే యుపయోగించుట - వేదము ఋషుల యభిమతానుసారముగ అనాదిసిద్ధమై నప్పుడే ఘటిల్లె ననియు, ఇట్టి శబ్దార్థ పరిజ్ఞాన రాహిత్యమే యాధునిక విమర్శలకు గారణ మనియు నభిప్రాయ పడి, గ్రంథకర్తలు బహుశ్రమపూర్వకముగ దాము జెప్పు ప్రతివిషయమునకు ప్రమాణముల జూపించుచు వేదస్వరూపము నీ గ్రంథమునందు చక్కగ విశదీకరించి యున్నారు.

వీరి రచనలో వైదికసంప్రదాయమునకు గాని, శాస్త్రసిద్ధాన్తమునకు గాని విరుద్ధ మైన విషయము వెదకినను కన్పించదు. అనేక గ్రంథ పరిశీలనాపూర్వకమైన యిట్టి రచన అనేకవిద్యా పారంగతులకే సాధ్యము. ప్రాపంచిక వ్యవహారముల ననుస రించుచు, నిట్టి విద్యాకృషిని గావించి యీ విధముగ వేదపురుషు నారాధించుచున్న హరిసోదరులకు పరమేశ్వరు డితోఽధిక వేదసేవావకాశము ననుగ్రహించు గాత.

ఆర్యసంస్కృతి పరిరక్షణము ముఖ్యోద్దేశముగా గల శ్రీ స్వధర్మస్వారాజ్య సంఘము శ్రీహరిసోదరుల విద్యాకృషిని అభినందించుచున్న విషయమును వారికి తెలుపుటకు మేము ఆనందించుచున్నాము.

కొత్తా స్వారాజ్యవిహార్
సికింద్రాబాదు. 25
13—10—1971

ఇట్లు
(సం) వీరేశ్వర కృష్ణ డోంగరే శాస్త్రి
(సం) సన్నిధానం లక్ష్మీనారాయణ మూర్తి

ఆర్షవిద్యా భూషణ

## జటావల్లభుల పురుషోత్తము

ఆంధ్రప్రదేశ విశ్వహిందూ పరిషదధ్యక్షులు

వైదికశబ్దముల కర్థనిర్ణయము చేయుటలో సంప్రదాయము, రూఢ యోగ రూఢార్థము లెంతవఱకు కుపకరించును ? యౌగికార్థ మెంతవఱకు న్యాయ్యము ? - ఇత్యాది ప్రశ్న లిటీవలి వారి నెంతో కలవరపెట్టినవి.

బోట్లింగ్, రాథ్ - అను జర్మనుపండితులు సంప్రదాయమును, రూఢ యోగరూఢార్థములను పూర్తిగా మఱచి పోయి ననే గాని వేదము మన కర్థము గాదనియు, అట్లు మఱచిపోవుట భారతీయుల కసాధ్య మగుటచే వేదార్థనిర్ణయమును జేయు నధికారము అభారతీయులకు మాత్రమే కలదనియు వాదించిరి. వారు తమపద్ధతిలో వేదార్థకోశమును రచించిరి.

మనదేశములో దయానందసరస్వతీస్వామివారు, 'సాయణుడు తన నాటికి నిలిచియున్న ఇటీవలి సంప్రదాయములకు లొంగిపోయి వేదార్థనిర్ణయమును జేయుటచే ఆయన భాష్యము వేదహృదయము నావిష్కరింప జాలదు' - అని యభిప్రాయపడి తాము స్వతంత్రముగా వేదములకు భాష్యము రచించిరి. అందు యాస్కుని ప్రమాణముగ స్వీకరించిరి.

మాక్సుమల్లర్, గోల్డుస్టుకర్, విల్సన్ మున్నగు పాశ్చాత్యులు సాయణుని పూర్తిగా విడచుకొనుచో మన కా వేదము దురవగాహ మనియు, ఆయనలో లోపము లున్న వనియు, వానిని మనము సవరించు కొనవలె ననియు భావించి .

మొత్తముమీద 200 సం॥ల నుండి బయలుదేరుచున్న వాదార్థ విమర్శకర్తలెల్లరు నిట్లు సాయణభాష్యప్రామాణ్యమును నిరాకరించుటయే కాక వేదములనుండి

యవిచ్ఛిన్న పారంపర్యముతో నొకసంప్రదాయ మీ భారతదేశమున వచ్చుచున్న దను భావమును గూడ త్రోసివైచిరి.

హరిసోదరు లీ భారతీనిరుక్తిలో నీ వాదముల నన్నింటిని పరాస్తము చేసి వేదార్థవిషయమున అవిచ్ఛిన్నపారంపర్య మున్నదని నిరూపించిరి. ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్ - అను వచనములో గర్భితమైన పారంపర్య భావమును అనేకోదాహరణములతో నిలబెట్టిరి. యాస్కుడు, మహీధరుడు, సాయణుడు భిన్నమార్గముల త్రొక్కినవారు కారని గూడ నీ గ్రంథము వలన దెలియ గలదు. ఎన్నియో స్థలములలో యాస్కుని ఉదహరించిన సాయణులు క్రొత్త దారిని త్రొక్కిరనుట సాహసమే యగును.

వేదములకు స్మృత్యాదులతో వైరుద్ధ్యమే కాక యంతర్గత వైరుద్ధ్యము కూడ నున్నదని పాశ్చాత్యుల యభిప్రాయము; స్మృత్యాదులతోనే వైరుద్ధ్యము కాని యంత ర్గత వైరుద్ధ్యము లేదని శ్రీదయానందమతము; అంతర్గతవైరుద్ధ్యము స్మృత్యాది వైరుద్ధ్యముకూడ లేదని సాంప్రదాయికుల మతము; ఇదియే సాయణుల మతము గూడ. హరిసోదరుల యీ గ్రంథములో సాంప్రదాయికపద్ధతియే నిలబెట్టబడినది.

సాంప్రదాయిక దృష్టిలో వేద మనగా మంత్రబ్రాహ్మణారణ్యకోపనిషద్వా ఙ్మయము. దయానందుల మతములో మంత్రము మాత్రమే. 'భారతీనిరుక్తి' సాంప్రదాయిక మతమును బహుప్రమాణములచే నిలబెట్టినది. ఇది సామాన్య విషయము కాదు. మంత్రబ్రాహ్మణయో ర్వేదనామధేయమ్ - అనుపట్ల బ్రాహ్మణ శబ్దము ఆరణ్యకోపనిషత్తులనుకూడ దెలుపు నని ప్రాచీనులు వ్యాఖ్యానించి యున్నారు. వేదోపనిషదః - అనునది బ్రాహ్మణపరివ్రాజక న్యాయమున గావింపబడిన ప్రయోగ మనియు దెలుపబడినది. ఇది సాంప్రదాయిక దృక్పథము. దీనిని హరిసోదరులు బహువిధముల సమర్థించి యున్నారు.

ఇట్లెన్నో విషయము లీ గ్రంథమున సప్రమాణముగ పరిష్కరింప బడినవి. వైదిక వాఙ్మయ గవేషణపరాయణుల కీ గ్రంథము కరదీపికగా నుండగలదు.

ఏతద్గ్రంథకర్తలు విద్యాసముద్రులు; సునిశిత ధిషణాభూషణులు; ఇట్టి యమూల్య గ్రంథరత్నముల నింకను రచించి విజ్ఞానవ్యాప్తికి వారు తోడ్పడగల రని నమ్ముచున్నాను.

కాకినాడ }
28-10-71 } (సం) జటావల్లభుల పురుషోత్తము

# Sri Ch. Markandeya Sastry

Inspector of Oriental Schools, Andhra State, Vijayawada.
(At Present Deputy Director for Oriental studies,
Andhra State)

I visited the Nirukta Bharati, Vijayawada, to-day and am highly pleased with the diversified work that is being conducted here...... The more important work that is being conducted by the institution is research in Vedic interpretation. I had a good opportunity to go through the papers prepared so far and am highly delighted by the standard of performance contained there in. The work is a useful and detailed suppliment to Yaska's Nirukta and it is not an exaggeration to say that it even excels the latter. I wish every success to the complete and speedy termination of this work and hope that it will be of good help to oriental scholars. The effort of Hari Brothers and their elder Sri Challa Satyanarayana Sastry garu, is commendable for their enthusiasm in putting forth this diversified work in promotion of Sanskrit and its culture.

Vijayawada }
26—10—1956 } **(Sd) Ch. Markandeya Sastri**

## Dr. Veluri Subba Rao

*M. A., Ph. D., B. O. L., B. Ed.*

Professor of Sanskrit, Andhra University,

WALTAIR (Andhra Pradesh.),


The theory that Veda, the Holy writ of the Hindus, was without a beginning in time and was intrinsically valid, has been assailed in some measure or other from time to time by the Buddhist, the Jain and other heretics. Even the Logician etc. of somewhat orthodox leanings, while admitting its validity in their own way, attacked its intrinsic validity and established the extrinsic nature of its validity. We have ample evidence of the controversies that raged over centuries on Pramanya Vada between the votaries of the two schools of thought. What the outcome of these arguments and counter arguments is, is a matter we had better leave to the individual scholar who can boldly and leisurely enter into the subtleties of Epistemology and Logic.

During the recent one or two centuries, it so happened that European scholars have begun to evince great interest in the recondite branch of the vedic Lore of the Hindus and attempted in course of time, not only translations of the vedic Texts but also a criticism of these texts. Broadly speaking these scholars appear to be of the opinion that the vedas are the works written by sages or seers (as they also called them) and belonged to one period of time or the other.

Some modern Indian Scholars, however, disputed the point and suggested a more remote date in the past. All

the evidences cited in respect of the date of the origin of the vedas were based on Linguistic studies etc. mostly internal. Not much credence was given to Purana and Itihasa literature which must really have handed down to us the traditional interpretation of the veda. The exegetist (Mimamsaka) since hoary times has tried to interpret Vedic Texts but this, too, did not weigh much with these scholars on important points. Great differences of opinion raised their heads in exegetical expositions between the traditional and the occidental scholars. Nevertheless as the Universities and higher institutes of learning were manned by scholars occidentally trained and paid by the Government (as they were mostly trained to study texts in English), the theories propouned by the western scholars gradually began to gain ground and the other traditional theories were relegated to the background-the only votaries of these being the orthodox scholars teaching a student or two in their own houses. It is thus that the traditional interpretation of Vedic Texts sank into oblivion. These Vedic scholars too, poor and unaided that they were, never came into open controversy with the moderns; nor did they write books vindicating the traditional exposition. Even if some were written, they were few and far between and very often left in manuscripts for want of necessary funds.

At or about the period when a nationalist spirit took possession of India, however, some Indian scholars tried to enter more studiously into the intricacies of these questions on the age of Veda, its origin, content and interpretation with the help of commentaries aided by a study of Mimamsa and tradition. But no persistent efforts appear to have been made in this connection in spite of the innate Hindu Conviction to the effect.

The present work is one such and probably the one of its kind taking into consideration the number of questions raised, western opinions quoted and criticised basing its views on expert Indian traditional exposition of a host of commentators.

In the present work, the authors have tried to show, as I think. the futility of pure reason and the arrogance of Rationalism in expounding subjects of a transcendental nature.

The Hari brothers have boldly undertaken this gigantic task of vindicating the ancient vedic etymologies and expositions with a conviction and they richly deserve the honour and glory of being the authors of such a work as this. The work speaks volumes of the labour these scholars have put forth over decades of study of ancient texts and commentaries. I wish them well and appeal to modern scholars of veda to study and understand their arguments sympathetically.

Waltair,<br>13-11-71.

**(Sd.) V. Subba Rao.**

# ఆచార్య డా॥ దివాకర్ల వేంకటావధాని,
## M. A., (Hons.) Ph. D.

అధ్యక్షులు, తెలుగుశాఖ - ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు.

వేదవాఙ్మయము ప్రపంచమున నతిప్రాచీనమైన వాఙ్మయము. ఇతర ఖండము లందలి జనులు విద్యావివేకములు కాని, నాగరికలక్షణములుకాని లేక తమోమయస్థితిలో నున్నపుడే భారతీయ మహర్షులు వేదమంత్రములను దర్శించిరి. అందుచేతనే వారికి మంత్రద్రష్టలను సార్థకనామ మేర్పడినది. తరువాత గురుశిష్య పరంపరా క్రమమున వేదములు లోకమున ప్రచారము పొందినవి. గురు వుపదేశింపగా విను శిష్యులచే నుచ్చరింపబడిన వగుటచేతనే వానికి శ్రుతులను ప్రసిద్ధి. అనంతా వై వేదాః - అను ప్రతీతి యెల్ల రెఱింగినదే. భగవంతుడైన వ్యాసమహర్షి వానిని ఋగ్యజుస్సామాథర్వము లను నాలుగు వేదములుగ విభజించి వేదవ్యాసు డని పేరు గాంచెను. భారతీయ సంస్కృతి వల్లరికి మూల కందము లని చెప్పదగినవి వేదములు. యన్నేహాస్తి న తత్ క్వచిత్ – అను మాట పంచమవేదమైన భారతము నెడనే సార్థక మైనప్పుడు వేదముల విషయము వేఱుగా చెప్పనేల ?

వేదనిక్షిప్తము లయిన ధర్మ నీతి తత్త్వములను కథోపాఖ్యానముల ద్వారా సామాన్యజనులకు గూడ నందుబాటులోనికి దెచ్చుటకై వాల్మీకి వ్యాసాది మహర్షులు రామాయణ మహాభారతములను పురాణముల రచించిరి. అవి యన్నియు వేదార్థోపబృంహణార్థము రచింపబడినవే యనుటలో సందేహము లేదు. అవే కాక వేదాఙ్గములు, శాస్త్రములు, స్మృతులు కూడ వేదార్థ వినిర్ణయ ప్రచారముల నిమిత్తము వెలువరింపబడినవే. అందుచే వేదతత్త్వము నెఱుంగుట కెవ్వరైన ప్రధానముగ వానిపైననే యాధారపడవలెను. యాస్కుడు నిరుక్తమును ప్రవర్తింప జేసియు, సాయణాదులు భాష్యములు రచించియు వేదార్థావబోధనమునకు గావించిన సేవ యింతింతనరానిది.

వేదములు కర్మప్రధానము లనియు, యజ్ఞయాగాదుల యాచరణమునందు మాత్రమే యుపయోగించు ననియు గొందఱి యభిప్రాయము, కాని యది సరికాదు. వేదములయందు పురుషార్థములలో శ్రేష్ఠమైన మోక్షమునకు సాధనమైన బ్రహ్మజ్ఞానముకూడ నిమిడియుండును. వేద మను పేరే యీ విషయమును జెప్పక చెప్పుచున్నది. దురదృష్టవశమున నిప్పుడు వేదవిజ్ఞానము క్రమక్రమముగ సన్నగిలి పోవుచున్నది. వేదముల వల్లించువారియు, తదర్థముల నెఱుంగదలచు వారియు సంఖ్య వ్రేళ్ళపై లెక్కపెట్టదగినదిగా నున్నది. ఇది భారతీయ సంస్కృతివికాస విస్తరణమున కెంత యాటంకకరమో వేఱుగ జెప్పనక్కఱలేదు.

'వేదము లపౌరుషేయములు; తన్మంత్రములను సమాధినిష్ఠు లయిన మహర్షులు దర్శించిరి' యను విషయమును విశ్వసింపక పలువు రిప్పుడు వానిని చారిత్రిక దృష్టితో బరిశీలించి యవి యితర లౌకిక రచనల వలెనే యొకకాలమున మానవులచేతనే కల్పింపబడిన వని భావించి వానికి స్వబుద్ధికల్పితములైన యర్థములు వెలువరించుటకు యత్నించుచున్నారు. వాని నవగాహనము చేసికొనుటకు వేదము నందే కల మంత్రములును, వేదాంగములును, శాస్త్రములును, స్మృతులును, పురాణములును దోడ్పడు నట్లుగ నెంత యుజ్జ్వలమైన దైనను కేవలమానవబుద్ధి యుపకరింప జాలదు. వేదములు స్వతఃప్రమాణములు. అందొకచోట గల పదముల నర్థము జేసికొనుట కన్యత్ర ప్రయుక్తము లయిన పదములు దోడ్పడును. అందుచే వేదములను సమగ్రముగ బరిశీలింపక, బుద్ధిమాత్ర సాహాయ్యముచే వాని యర్థము నెఱుంగ యత్నించుట కేవల బాహుసాహాయ్యమున దుర్గమగభీరమైన మహాజలరాశి నీదదలచుట వలె బరిహాసాస్పద మగును. మఱియు లౌకికగ్రంథము లకు వలె వేదమంత్రములకు గూడ పరిమితమైన బుద్ధితోడ్పాటుతో నర్థనిర్ణయము జేయగడంగుటవలన నొక యుపద్రవముకూడ నావహిల్లును. లౌకికరచనలకు దురర్థము జెప్పుటవలన జ్ఞానసంకోచమే కలుగును గాని ప్రత్యవాయ మేమియు కలుగదు. వేదమంత్రముల కపార్థము జెప్పుటవలన రెండును నేర్పడును. అందుచే వేదార్థనిర్ణయవిషయమున నెంతైన జాగరూకత వహింపవలసియున్నది. వేదభారతివలె పరమాత్మస్వరూప నిర్ణయము చేయజాలు వాఙ్మయము మఱొకటి లేదు.

ఈ విషయమును గ్రహించి, పాశ్చాత్యులే కాక భారతీయులు కూడ కొందఱు వేదమంత్రములకు బుద్ధిప్రధానముగ జెప్పుచుండు నర్థవివరణాదులను, వ్యాఖ్యానముల జూచి సంతాపము నొంది, సంప్రదాయ విజ్ఞానరక్షణ తత్పరులైన హరిసోదరులు భారతీ (వేద) నిరుక్తి యను నీ మహోదాత్తగ్రంథమును రచించి భారతీయుల కృతజ్ఞతకు బాత్రులైనారు. నిరుక్తి యనగా పదముల కుత్పత్తినిర్ణయపూర్వకమైన యర్థవివరణము. నిరుక్తి యను పేరుగల యలంకారముగూడ నొకటి గలదు. 'నిరుక్తి ర్యోగతో నామ్నా మన్యార్థత్వ ప్రకల్పనమ్' - అని చంద్రాలోకము చెప్పు చున్నది. ఇది శ్లేషవిశేషమే యని కొందఱి యభిప్రాయము. వేదములందలి శబ్ద ముల విషయమునగూడ నీ నిర్వచనము సరిపోవును. అందలి శబ్దములు ప్రసిద్ధము లగు నర్థములతోపాటు యోగశక్తిచే రమణీయతరమైన యన్యార్థస్ఫూర్తినికూడ గలిగించుచునే యుండును. శ్రీ హరిసోదరు లిందు వేదము లందలి శబ్దములకు సాంప్రదాయికములు, సమగ్రములు, సర్వాంగీకార్యములు నగు నర్థము లొసంగుటకై యత్నించి కృతార్థులైరి. అందుచే 'భారతీనిరుక్తి యను' నామధేయ మీ గ్రంథ మున కెంతైన దగియున్నది. వారు వేదమంత్ర శబ్దార్థనిర్ణయమునకు గావలసిన సమగ్రవ్యుత్పత్తి నార్జించిన పిమ్మటనే యా కార్యమునకు కడంగియుండుట ముదా వహము. ఆ వ్యుత్పత్తితోపాటు భగవత్ప్రసాదితమైన ప్రతిభయు వారికి పుష్కలముగ నలవడియుండుటచే వారు కావించిన యీ ప్రయత్న మత్యంతప్రశంసాపాత్రమై యలరారుచున్నది.

వేదము, ఋషి, బ్రహ్మ, ఆమ్నాయము, శ్రుతి, త్రయీ, స్వాధ్యాయము స్వధా,స్వాహా,వషట్,త్రయీ'భారతీ'ఛందములు - మున్నగు శబ్దములకు వేదములనుం డియే కాక ప్రామాణికములైన యితరగ్రంథములనుండి కూడ నుదాహరణము లొసం గుచు వారు కావించిన వివిధార్థవివరణ మాశ్చర్యకరమై వారి వ్యుత్పత్తివిశేషము నకును, బహుగ్రంథపరిచయమునకును దార్కాణమై యున్నది. కావ్యమ్ - కవి యను ప్రకరణమున వేదముయొక్క కావ్యతావైశిష్ట్యమును నిరూపించిన తెఱంగు మిక్కిలి మెచ్చదగియున్నది. చారిత్రికుల వాదముల నుటంకించి యందలి లోపము లను వారు చక్కగ బ్రకటించియున్నారు. అచ్చటచ్చట వారు వేదమంత్రముల కొసంగిన యర్థతాత్పర్యములు విస్పష్టములై, సర్వజన సుబోధములుగా నున్నవి. వారు వ్యుత్పత్తిచేతనే కాక సంస్కారవిశేషముచే కూడ వర్ణపరిశ్రమ గావించుచు నొక్క

వంక నైహికమునకు వేఱొకవంక పారలౌకికమునకు ఘంటాపథము నేర్పఱచు కొన్నారు. వారు ప్రకరణారంభములం దొసంగిన వేదమాతృ స్తవ రూపము లైన శ్లోకములు భావగంభీరములును, ధారాశుద్ధి శోభితములునై వారికి సంస్కృతభాషపై గల పాండిత్యమును, వేదములయెడ గల యాదరమును సూచించుచున్నవి.

ఇందలి వచనశైలి శక్తిమంతమై నిర్దుష్టమై ధారాళమై చదివినకొలంది చదువవలె నను నుత్కంఠ రేకెత్తించుచున్నది. ప్రతిపుటయందు హరిసోదరులు కావించిన కృషి స్పష్టముగా కానవచ్చుచున్నది. వా రెడనెడ గావించిన యర్థ వివరణము సులభమును, విమర్శ నిష్పక్షపాతము నై యింపు నింపుచున్నవి. వేదములయెడ వారికిగల గౌరవాదరములు మేదురము లైనవి. ఎంతో శ్రమపడి ఎన్నో గ్రంథముల బరిశీలించి వ్రాసిన యీ గ్రంథము వారి భారతీయసంస్కృతి సంపదభిమానమును జాటుచున్నది. జగద్గురువులు శ్రీ కామకోటి శంకరాచార్య స్వామి వర్యుల వేదములను గూర్చిన వ్యాస మీ గ్రంథమునకు తిలకాయమానముగా నున్నది. పండితాఖండలులు, సంప్రదాయాభిమానులు, రమణీయ రచనాదక్షులు నైన యీ గ్రంథకర్తలు పవిత్రములైన యిట్టి గ్రంథముల నింకను రచించి యాంధ్ర సరస్వతికివలె భారతీయసంస్కృతికిని నూత్నశోభ గల్గింతు రని వేడుచున్నాము.

హైదరాబాదు,
1—2—1971

(సం) దివాకర్ల వేంకటావధాని

## మహోపాధ్యాయ, బాలవ్యాఖ్యాన, తర్క వ్యాకరణ వేదాంతకేసరి

## శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు

శ్రీరామ. శ్రీ హరిసోదరులచే రచింపబడి యున్న 'భారతీనిరుక్తి (వేద స్వరూపదర్శనము)' - అను గ్రంథము విద్వ దాదరణీయమై యొప్పుచున్నది. వేదవాఙ్మయములో గల నిగూఢవిషయము లెన్నియో బహుప్రమాణములతో నిరూపింపబడి యున్న గ్రంథరత్న మిది. రత్నములయొక్క వివేకవిజ్ఞానములు ఆ రత్నములతో వ్యవహరించు వారికే తప్ప ఇతరుల కసంభవము అగునట్లు అధ్యయన - అధ్యాపన - అర్థజ్ఞాన - ఆచరణ పద్ధతులతో సతతము వ్యవహరించు వారికే వేదములయొక్క వివేకజ్ఞానములు కాని యితరుల కవి యసంభవ మనుటలో సందేహము లేదు. ఇట్టి స్థితిలో వేదసారస్వతముపై వేదసంప్రదాయ మెఱుగని యాధునికుల వాదము లెన్నియో తలయెత్తినవి.

1. 6000 సం॥ ల నాడు ఆర్యులచే రచింపబడినవి వేదములు.

2. ఆ వేదములు 'త్రయీ' అనుటచే మొట్ట మొదట మూడే - అథర్వ వేదము చిరకాలమునకు గాని 'వేదము' అను ప్రసిద్ధి నందలేదు.

3. ఆ వేదములలోని బ్రాహ్మణభాగము వేదము కాదు - ఇత్యాదులు.

ఈ వాదములు అప్రమాణము లని, అసంగతము లని బహుప్రమాణ ప్రదర్శనపూర్వకముగా నిరూపించుచున్నది యీ గ్రంథము. ఆధునిక వాదములను బట్టి సందిగ్ధస్థితిలో నుండువారికిని, వేదసారస్వతారాధకులకును ఈ గ్రంథము మహోపకారకము.

ఈ గ్రంథరచనలో మీరు చేసిన కృషి యసాధారణము. దీని నభినందించు చున్నాము.

పిఠాపురము
26-11-1971

(సం) వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి

సాంగవేదసమ్రాట్, మీమాంసావిద్యాప్రవీణ

# రేమిల్ల సూర్యప్రకాశశాస్త్రి

ప్రిన్సిపాల్, శ్రీ గౌతమీ విద్యాపీఠమ్, ఓరియంటల్ కళాశాల, రాజమండ్రి

శ్రీ హరిసోదరులు రచించిన 'భారతీనిరుక్తి' యను గ్రంథ మామూలాగ్రముగ చదివి పరిశీలించితిని.

వీరు వ్యాకరణాదిశాస్త్రముల నధ్యయనము చేయుటయే గాక ఇతరశాస్త్రముల యందును దృఢపరిచయము గలవారు. లౌకికాలౌకికములను రెంటిని పరిశోధన చేయుటయందు చాల నిపుణులు. కనుకనే హరివారికి పర్యాయపదముగ 'శోధన్ వారు' - అని గూడ వ్యవహారము గలదు. వీరీ గ్రంథమును రచించుటలో నత్యంతపరిశ్రమ నొనర్చి సాగించిన కృషి అనన్యసాధారణమైన దని యీ గ్రంథ ద్రష్టలగువారికి వేఱుగ చెప్పనవసరము లేదు. వీరిగ్రంథమునకు చరిత్రకారులైన అధునాతనులు వేదములకు గల్పించిన యభూతకల్పనలను, వారు ప్రదర్శించిన నాస్తికత్వమును నిరసించుటయే పరమలక్ష్యమై యున్నది.

లోకములో వేదార్థనిర్ణయమునకు రెండుపద్ధతులు గలవు. 1. మీమాంసా పద్ధతి 2 ఐతిహాసిక (చారిత్రిక) పద్ధతి. వైదేశికులును, తదనుయాయులై యూంగ్ల భాషాశిక్షా మండితులు నైన భారతీయులును చారిత్రికదృష్టితోనే వేదముల విమర్శించి వేదములందు వినబడుచున్న ఋషులు ప్రాకృతజనులే యనియు, అట్టి ఋషులచే చేయబడిన తత్తద్దేవతా ప్రశంసావచనములే తత్తద్దేవతాసూక్తములుగ వ్యవహరింప బడుచున్న వనియు, ఆ యా వేదభాగము లా యా కాలములందు రచింపబడి యావిర్భావకాలవిశేషము గల వనియు, పెక్కువిధములుగ వేదములకు పౌరుషే త్వమును కాలపరిమితిని మున్నగు వానిని నిరూపించిరి.

షడఙ్గో వేదోఽధ్యేతవ్యో జ్ఞేయ శ్చ - అను వచనానుసారముగ అంగము లైన శిక్షా వ్యాకరణాదులచే వేదములయొక్క పదపదార్థములను తెలిసికొని విశేషముగ మీమాంసాది శాస్త్రసహాయముచే వాక్యార్థనిర్ణయము చేయవలసియున్నది. కనుకనే పార్థసారథిమిశ్రులు మీమాంసా న్యాయరత్నమాల యందు—

'జిజ్ఞాసోపనీతస్య ద్వితీయా పఠితశ్రుతేః।
జ్ఞాతవేదాంగకస్యాన్యా యా మీమాంసా పురఃసరా॥'

అను శ్లోకముచే మూడురకముల జిజ్ఞాసలు మూడుకాలములం దుండు నని సూచించిరి. అందు 1. ఉపనీతునకు తన కర్తవ్యమును తెలిసికొనుటరూపమైన జిజ్ఞాస. 2. అధ్యయనముజేసిన పిమ్మట అధీతవేదభాగమున కర్థమును తెలిసి కొనుట రూపమైన జిజ్ఞాస. 3. వ్యాకరణాది శాస్త్రసహాయముచే పదపదార్థము తెలిసినపిమ్మట పరస్పరవిరుద్ధము గాకుండునట్లు వాక్యార్థనిర్ణయమును తెలిసికొనుట - అను మూడురకములైన జిజ్ఞాసలిట జెప్పబడినవి. దీని ననుసరించి వేదాంగములైన శిక్షాది శాస్త్రములచేతను, మీమాంసాది శాస్త్రసహాయముతోను వేదార్థము నిర్ణయింప వలసియున్నది. మఱియు 'ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్'— అను వేదవ్యాసవచనానుసారము వేదముల కుపబృంహకములైన ఇతిహాసపురాణాదుల చేతను వేదార్థము నిర్ణయింపబడవలసియున్నది.

ఆ రీతిగ వీరు వేదః, ఋషిః, బ్రహ్మ, ఆమ్నాయః. శ్రుతిః. స్వాధ్యాయః, స్వాహా, స్వధా, వషట్, కవిః - కావ్యమ్- ఇత్యాది వైదికపదముల బ్రదర్శించి, యవి యపౌరుషేయములగు వేదములకు పర్యాయపదము లని నిరూపించుటకై యనేకవిధములగు వ్యుత్పత్తి వైచిత్ర్యముల బ్రదర్శించిరి. వ్యుత్పత్తివైచిత్ర్య ములచే పై పదములు వేదవాచకము లగుటయేగాక యనేకార్థములకు బోధకము లగుచున్న వనియు, ఇట్టి యర్థవిశేషగాంభీర్యముగల యీ పదములచేతనే చరిత్ర కారులు కల్పించిన యభూతకల్పనారూపము లగు అర్థములు పొసగ వనియు, వానిచే పరస్పరవిరోధము వాటిల్లుచున్న దనియు నిరూపించిరి.

లోకములో పండితులు స్వాభిప్రేతములైన యర్థముల జూపుటకై వారికి తోచిన విధముగ వ్యుత్పత్తిని ప్రదర్శింతు రనియు గల యపవాదమును పరిహరించుటకై

వీరు ప్రతివ్యుత్పత్తివిశేషమునకును అనేకములైన శ్రుతిస్మృత్యాదులను ప్రమాణములుగ ప్రదర్శించిరి. ప్రమాణవిశేషములచే వ్యుత్పత్తివిశేషము నాశ్రయించి శ్రుతి స్మృత్యాదులకు పరస్పరవిరోధము లేకుండునట్లు ఏకవాక్యతను సంపాదింపవలెనని మీమాంసా తంత్రవార్తికమున కుమారిలభట్టపాదులు—

'మనుష్యప్రతిషేధా ద్వా తేజో బల వశేన వా ।
యథా వా శ్రుత్యవిరుద్ధ స్తథా తద్గమయిష్యతి ॥

అని నుడివిరి. అనగా పురాణపురుషులైన యుధిష్ఠిర విశ్వామిత్రాదులు శాస్త్రీయ నిషేధముల నుల్లంఘించిరి ; అందువలన శిష్టాచారము ప్రమాణము కానేరదు—అను శంకకు సమాధానముగా— "శాస్త్రములందలి విధినిషేధములు మనుష్యాదికారకములు లేక యవి వారికిగూడ వర్తించినను వారు తమ తపోబలముచే నిషేధోల్లంఘనజన్య ప్రత్యవాయమును పరిహరింప సమర్థులు ; లేదా మన మనుకొను రీతిలో రూఢ్యర్థమును స్వీకరింపక వ్యుత్పత్తివిశేషముచే అర్థవిశేషమును గ్రహించి, శ్రుతిస్మృత్యాదులకు పరస్పరము విరోధము లేకుండునట్లు సమన్వయము చేసికొనవలెను."— అని యర్థము. ఏతదనుగుణముగనే ప్రమాణపురఃసరముగ వేదః మొదలైన పదములకు వ్యుత్పత్తివిశేషముల జూపి, వేదములయొక్క అనాదిత్వ - అపౌరుషేయత్వ - నిత్యత్వ - స్వతఃప్రమాణత్వాదులను ప్రదర్శించి, నాస్తికులయొక్క నాస్తికత్వమును నిరసించుచు, ఆస్తికుల యాస్తికత్వమును బెంపొందించుట కీ గ్రంథము మహోపకారక మనుట నిర్వివాదము.

వీరి పరిశోధనయందలి సామంజస్యమును నిరూపించుటకై స్థాలీపులాక న్యాయముగ నొకటి రెండు స్థలములయందలి పరిశోధనలను జూపుచున్నాను.

'వేదః' అను పదమును నిర్వచించుచు, 'వేత్తీతి వేదః' అను నిర్వచనముచే నిది బ్రహ్మవాచకమై, 'వేదయతీతి వేదః' - అను నిర్వచనము ననుసరించి యట్టి బ్రహ్మను ప్రతిపాదించుటచే నీ గ్రంథము వేదము అను నామమున విలసిల్లినదనియు, వేదపదము పలుచోట్ల పలువిధములుగ బ్రయోగింపబడి ముఖ్య లాక్షణికాది భేదములతో నొకే యర్థమునందు పర్యవసితమైన దనియు, 'ఋగ్యజుఃసామాత్మక వేదరాశి నా స్వరూపము' - అని భగవంతుడు కీర్తించినట్లుగల శ్రుతి స్మృత్యాది

వచనములు భిన్నదేశములందు భిన్నకాలములందు భిన్నకర్తలచే రచింపబడి యుండుచో 'ఇట్టి ఈ భిన్నకర్తృకములు భిన్నకాలికములు లగు వేదములు భగవత్స్వరూపము' అని ఏ కర్త చెప్పగలడు? - అని సూటిగ ప్రశ్నించుచు అర్థ గాంభీర్యముగల వేదశబ్దముచేతనే వేదములయొక్క అనాదిత్వ - అపౌరుషేయత్వాదులను వీరు నిరూపించిరి.

ఇట్లే స్వాధ్యాయపద నిర్వచనసమయమున మహాభాష్యకారులు చూపిన వ్యుత్పత్తివిశేషముల బేర్కొని, మీమాంసాశాస్త్రమున సర్వశాఖాధికరణ మందు జెప్పబడినట్లుగ గూడ 'స్వశ్చాసౌ అధ్యాయః స్వాధ్యాయః' - అను వ్యుత్పత్తి నాశ్రయించి పితృ పితామహ పరంపరాగతమైన వేదశాఖాధ్యయనము జేయవలె ననియు, భాట్టచింతామణ్యుక్తప్రకార మొక్కొక్క వేదమం దొక్కొక్క శాఖాధ్యయనము నిత్య మనియు, 'స్మర్యతే చ వైశంపాయనః సర్వశాఖాధ్యాయీ' యను భాష్యకారవచనానుసారము కృత్స్న వేదశాఖాధ్యయనము జేయ నగు ననియు నిరూపించి, పై నిర్ణయముల కుపష్టంభకములుగ స్మృతి పురాణాది వచనముల నుదాహరించి కొందఱు కేవలము ఏకశాఖాధ్యయనము, కొందఱు ప్రతివేదశాఖాధ్యయనము, కొందఱు కృత్స్నవేదశాఖాధ్యయనము చేయవలె నని యుగభేద - అధికారిభేదముల ననుసరించి వ్యవస్థ చేసిరి.

వేదార్థనిర్ణేత లందఱు వేదవ్యాస వచనానుసారము వేదార్థోపబృంహకము లగు నితిహాస పురాణముల నన్నిటిని విమర్శింపవలసిన భారమును తగ్గించి యొకే చోట వీని నన్నిటిని పుంజీకృతము చేయుటచేత వీరికృషి గమనార్హము; వేదార్థ నిర్ణేతలకు నత్యుత్తమహోపకారకము.

ఈ విధముగ నన్నితెఁగలవారికి - ఆస్తికులకు ఆస్తికత్వమును బెంపొందించు కొనుటకును, నాస్తికులకు నాస్తికత్వమును బరిహరించుకొనుటకును, వేదార్థనిర్ణేతల కర్థనిర్ణయము జేసికొనుటకును, సాహిత్యపిపాస గల వారలకు వ్యుత్పత్తివిశేషముల నాశ్రయించి సాహిత్యమును బెంపొందించుకొనుటకును - అధికారిభేదము ననుసరించి పెక్కువిధములుగ నుపయోగపడెడి యిట్టి యీ గ్రంథ మపూర్వమైనదనియు, అనన్యసాధారణమైన దనియు జెప్పుట యతిశయోక్తి గానేరదు.

ఈ యాధునికయుగములో ప్రాచీనసంప్రదాయము ననుసరించి యొక్కొక్క శాస్త్రమునందు నిష్ణాతులైనవారే అతిదుర్లభము. నవ్యవిజ్ఞానము (సైన్సు) యతీవేగముతో ప్రతిమానవుని ఆవరించుచున్నది. విద్యావిధానములోను, సాంఘిక వ్యవస్థలోను విపరీతమైన మార్పులు వచ్చిన కాల మిది. ప్రాచీన సంప్రదాయాను గుణముగ శాస్త్రీయవిజ్ఞాన పరిచయముగల భాగ్య మీ నాటి పౌరులలో చాలవఱకు మృగ్యము. నవ్యవిజ్ఞానము బాహ్యవిషయములను మాత్రమే సూచింపగలదు కాని యాధ్యాత్మిక విషయములను సూచింపలేదు. ఐహికాముష్మిక విషయ విజ్ఞాన సముపార్జనా పిపాసగల వారంద ఱీ గ్రంథమును బఠించి ధన్యు లగుదురు గాక.

మఱియు నిట్టి యపూర్వగ్రంథములను రచించుటకు రచయితలకు తగు సామర్థ్యమును, ఆయురారోగ్యాదులను పరమేశ్వరుడు ప్రసాదించు గాక — అని ప్రార్థించుచున్నాను.

రాజమహేంద్రవరమ్
18—12—1971

రేమిల్ల సూర్యప్రకాశశాస్త్రి

## శ్రీ సూరి రామకోటి శాస్త్రి గారు

ప్రిన్సిపాల్. కె. యల్. యన్. సంస్కృతకళాశాల, తెనాలి.

### భా ర తీ ని రు క్తి

వేద ధర్మ సంప్రదాయ రక్షణాయ ప్రవృత్తో౽యం గ్రన్థః అన్వర్థ నామపరిశీలన ముఖేన వేదస్వరూపం దర్శయన్ చకాస్తి। ఏషా పద్ధతిః మాయాస్వరూప వివరణే పంచపాదికాకారై రాదృతా। వేదః, ఋషిః, బ్రహ్మ, ఆమ్నాయః, శ్రుతిః, స్వాధ్యాయః, ఛందః - ఇత్యాదీనాం నామ్నాం గమ్భీర మర్థం వివేచయన్తః శ్రీ హరిసోదరాః ఋషీణాం భావనాపథం సప్రమాణం పురస్కుర్వతే। నిరస్యన్తి చ సయుక్తికం కువాదాన్ విమర్శకాగ్రేసరాణా మసాంప్రదాయికానామ్। ప్రాచ్య పాశ్చాత్య విజ్ఞాన ఫలభూతో౽యం నిబన్ధః విద్యాస్థానేషు వేదస్య ప్రాముఖ్య మావిష్కుర్వన్ తత్త్వజిజ్ఞాసూనా ముపకారాయ కల్పతే। ప్రచయం గచ్ఛ న్నయం పరిశోధనోద్యమః భారతీయానాం సంస్కృతేః ధర్మస్య విజ్ఞానస్య చ ప్రకాశనేన జేగీయతామ్.

ఇతి నివేదయితా

(సం) సూరి రామకోటి శాస్త్రి

సుధీవిధేయః

తెనాలి<br>24—12—71

వ్యాకరణరత్న-వ్యాకరణాచార్య-ఉపనిషదర్థవాచస్పతి-దర్శనాచార్య

## శ్రీ పేరి సూర్యనారాయణశాస్త్రి గారు

శ్రీ హరిసోదరులు వేదములను వేదభాష్యములను వేదాంగములను లౌకిక సంస్కృత వాఙ్మయమును బాగుగ పరిశీలించి "భారతీనిరుక్తి" యను చక్కని గ్రంథమును నిర్మించిరి. ఈ గ్రంథము ఈ నాటి ప్రజలలో కలిగెడి కలవరములకు చక్కని సమాధాన మీయగలదు. దీని మూలమున వేదవేదాంగములందు ఆస్తికులకు విశ్వాసాతిశయము కలుగును. తాను నమ్మిన పదార్థమందు ఇతరులు ఆక్షేపము చూపి నపు డా యాక్షేపములకు పరిహారము లేనియెడల నా పదార్థమందు విశ్వాసము తగ్గుట సహజము. వేదములు అపౌరుషేయములు. అవి ఐహిక పారలౌకిక సౌఖ్యములను బోధించుచు చివరకు నిర్గుణాద్వయ బ్రహ్మభావ మగు మోక్షమును జీవునకు బోధించును. దీనిని భారతీయులు విశ్వసించి యున్నారు. కాని ఖండాంతరీయుల వాసనాబలముచే ఏవియో కొన్ని యాక్షేపములు తట్టగ వానికి తగు విధమగు సమాధానము లేని యపు డా విశ్వాసము సన్నగిల్లును. ఇట్టి దురవస్థ ప్రస్తుతము భారతీయులకు తటస్థించినది. ఇట్టి సమయమున ఈ గ్రంథము ఇతరుల యాక్షేపములకు తగు రీతిని సమాధాన మిచ్చి ఆస్తికులకు వేద వేదాంగములందు విశ్వాసాతిశయమును కల్పించగలదు.

ఇందు వేదః, ఋషిః, బ్రహ్మ, ఆమ్నాయః-శ్రుతిః. స్వాధ్యాయః, స్వాహా, స్వధా, వషట్, త్రయీ, కవిః-కావ్యమ్, భారతీ, ఛందః — అను శీర్షికలతో అనేకవిషయములు చర్చింపబడినవి.

ఈ గ్రంథమును సమగ్రముగ పరిశీలించినచో భారతీయవిజ్ఞానమున హరిసోదరులకు గల శాస్త్రవైదుష్య మెంతయో విదితము కాగలదు. ఇంకను ఇట్టి ఉత్తమ గ్రంథములను రచించి లోకోపకారము చేయుటకై వారికి సకలశ్రేయస్సుల నొసంగ వలయునని పరాత్పరుడగు శ్రీహరిని ప్రార్థించుచున్నాడను.

గౌతమీ విద్యాపీఠము,<br>ఓరియంటల్ కాలేజి,<br>రాజమండ్రి<br>8-1-72.

ఇట్లు<br>పేరి సూర్యనారాయణశాస్త్రి

## శ్రీ జనస్వామి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, తెనాలి

భారతీ సేవాయత్త చిత్తులగు సోదరులకు నమోవాకములు. మీ గ్రంథము చూచితిని, అమితానందముతో తలమునుక లైనవి. ఇది మీ ప్రతిభావ్యుత్పత్తుల కొక మచ్చుతునక. వేదమాతృ హృదయమును ప్రపంచించుట యన్న సామాన్య విషయము కాదు. ఆ తల్లి 'నాసంతానము నిర్వీర్యము కాదు; మాతృగౌరవము నిలబెట్టగల బిడ్డలు నేటికిని ఉన్నారు గదా!' - అని మురిపెపడును. ఆమె యాశీస్సు, అనుగ్రహము మీకు (నాకు గూడ) సదా కలుగుగాక.

'వేదోఽసి; అహో బుధ్నియ' - మున్నగు మంత్రముల ద్వారా వేదాపౌరుషేయత్వమును సాధించుటలో మీ వాదపటిమ శ్లాఘనీయము. వేదములకు పౌర్వాపర్యము గలదు - అను వాదము తుత్తునియలు గావింపబడినది. ఉపనిషత్తత్త్వము సంహితలందును బ్రతిపాదింపబడిన దనుటలో మీరు చూపిన ప్రతిభకు ముగ్ధుడనైతిని. ఋషిశబ్ద తాత్పర్యనిరూపణములో గూడ మీ ప్రతిభ అడుగడుగున ప్రస్ఫుటమగుచున్నది. ముఖ్యముగ 'ఋషీణాం పున రాద్యానాం'- అను స్థలమున మీరు జేసిన సమన్వయము నావ్యతో దర్శనీయము; శ్రుతిచోదితార్థ ప్రతిపాదన సమర్థము. బ్రహ్మశబ్ద విచారమున సంస్కృత శబ్దశక్తి స్వరూపము చక్కగ వివరింపబడినది. ఉపాదాన కారణసామ్యముచే 'వాక్కు బ్రహ్మయే' యని ప్రతిపాదింపగలుగుట శ్రుతికిని, తన్మననపరాయణులగు వారికిని (మీకును) జెల్లును. ప్రతిష్ఠాశబ్దము బ్రహ్మప్రతిపాదక మను విషయము సోపపత్తికముగ నిరూపితము. నవ - నవ్య శబ్దవిచారమునను, అశ్వమేధయాగమున స్వయంకృత గాథలగూర్చిన విచారమునను, వాక - అనువాక - అనూచానాది పదముల వివరణమునను మీ బుద్ధివైభవము కండ్లకు గట్టును.

స్వాహాశబ్దపరిశీలనమును తదేకలగ్న బుద్ధితో జూచితిని. మీరు జూపిన సమన్వయము, స్వాహా దేవతాతత్త్వమును వ్యక్తపఱచుటలో మీరు పడిన శ్రమ బుధజన ప్రశంసనీయము. దీనిని విని శ్రీశ్రీశ్రీ కామకోటి శ్రీచరణులు అమితానందపరవశులై రన్నచో - ఆ సమయమున వారు తప్పక పరాదేవతను

దర్శించియే యుందురు. ఈ పుస్తకమును చదివిన ప్రతి సహృదయు డట్టి యానంద మునే బొందును. దీని నంతయు జూడ ఆ స్వాహాదేవతయే - ఆ చల్లనితల్లి సరస్వతియే - మిమ్ము ఆవేశించినట్లు తోచును. ధన్యా యూయం; అహ మపి ధన్యః.

స్వధాశబ్దవిచారము స్వాహాశబ్దవిచారముకంటె మిన్నగ నుండునా? — యను తలంపుతో చదువ మొదలిడితిని. కాని, 'నా బుద్ధి భ్రమాత్మకమ'ని మీ యీ స్వధాశబ్దపరిశీలనము నిరూపించినది.

త్రియాశబ్దము మన్త్రత్రైవిద్యప్రతిపాదకము, యోగత్రైవిద్య ప్రతిపాదకము; అథర్వవేద విషయమై చారిత్రికకల్పనలు భ్రాంతిమూలకములు - ఇత్యాది విషయముల గూర్చిన మీ ప్రతిపాదన మసందిగ్ధముగ నప్రతిహతముగ సాగినది. వేదము ప్రభు సుహృత్ కాంతా సంమితమై తానే కవియు కావ్యము గూడ: ఈ విషయమై "నియతికృత నియమరహితామ్" "ఇదం కవిభ్యః పూర్వేభ్యః" మున్నగు శ్లోకములకును, అశ్లే భరత, అగ్ని-వాయు-ఆదిత్య, ఇడా-సరస్వతీ-భారతీ స్వరూపముల వివరించుచు 'మాతా రుద్రాణామ్; మనో హి సరస్వాన్ వాక్ సరస్వతీ'—ఇత్యాది మంత్రములకును మీరు చూపిన సమన్వయము ముచ్చటగా నున్నది. 'భరతు లొక తెగవారు'—అను వాదము చక్కగ పరాస్తమైనది. బ్రహ్మశబ్ద విచారమునను, ఛందఃశబ్ద ప్రకరణమునను బ్రహ్మ-బ్రాహ్మణ శబ్దార్థవిచార మత్యన్త సమీచీనము. బ్రాహ్మణభాగములో మంత్రభాగము కాని, మంత్రభాగములో బ్రాహ్మణభాగము కాని యుండ దను భ్రాంతి నిర్మూలితమైనది. "మన్త్రబ్రాహ్మణయో ర్వేదనామధేయమ్" అను ఆర్షసంప్రదాయ మిట సిద్ధాంతీకరింపబడినది. తుదకు సర్వము ఛందోమయముగ దర్శింపజేయుటతో ఛందశ్శబ్ద ప్రాశస్త్య మినుమడించినది. మీ యీ గ్రంథము శ్రుతిహృదయము నెఱుగగోరు వారికి కరదీపిక కాగలదని విశ్వసించుచు సెలవుతీసికొందును.

"ఛందోమయాయ పురుషాయ నమః పరస్మై"

తెనాలి,
23-4-71. } జనస్వామి సుబ్రహ్మణ్యశాస్త్రి

# గ్రంథమండలి మాట

అనంతనామధేయాయ సర్వాకార విధాయినే
సమస్తమంత్రవాచ్యాయ విశ్వైకపతయే నమః

ఒక డొక విద్యయందు వింధ్యమువలెఁ బెరిగి, స్వీయప్రతిభా సమున్మేషమాత్ర మూఁతగాఁగొని, తన కవిదిత సంప్రదాయమైన వేఱొక మహావిద్యను వ్యాఖ్యానింపఁ బూనుచో వానికి లౌకికముగా నొక మహాధికార పదవికూడ సంప్రాప్తించియున్నచో- నాతఁడు సేయు దుర్వ్యాఖ్యానమనెడు గర్తమునుండి యా మహావిద్యను సంప్రదాయ శుద్ధముగా సముద్ధరించుటకు బృహస్పతి యొకఁడు చాలఁడు. ఏలన; వాఁడువింధ్యమై పెరుఁగువేళ వాని ప్రతిభ వికసించినదికదా! అట్లు వికసితమైన ప్రతిభతో వాఁడు తర్కించును. వాని తర్కమున కెవఁడు సమాధానము చెప్పఁగలఁడు? వాఁడు ఇటు చూపి అటు, అటుచూపి ఇటు ప్రతారించును. ఓడి గెలిచితి ననును. వాఁడు అధికార వింధ్యముగాఁ బ్రసిద్ధుఁడు కదా! లోకము వానినే యనుసరించును. అప్పుడీ సంప్రదాయజ్ఞుఁడైన విద్వాంసుఁ డుస్సురని నిట్టూర్పుట దక్క యేమి చేయఁగలఁడు? అహో! కువ్యాఖ్యయొక్క జీవ మెంత గట్టిది! అది రాహువు. దాని తల తఱిగినను తలకుఁదలగా మొండెమునకు మొండెముగా నది బ్రదుకుచుండును. అందులకే సంప్రదాయవేత్త విద్యా పరిరక్షణమునం దనంతకాలము పరిశ్రమించుట.

పాశ్చాత్యులు, అపౌరుషేయములు, అవిచ్ఛిన్న సంప్రదాయ సంప్రాప్తములు నగు వేదములను పౌరుషేయములుగా వ్యాఖ్యానించిరి. కాలకాలుని నిట్టూర్పులకు (అస్య మహతో భూతస్య నిశ్వసిత మేతద్ యద్........) కాలనిర్ణయము సేయఁ బూనిరి. అచ్చమైన జ్ఞానరాశికి కర్తలను వెదకిరి. 'చైతన్యమున కుత్పత్తిస్థానము జడము'-అనెడి విజ్ఞాన సంప్రదాయమునకుఁ జెందినవారి బుద్ధుల కట్లు తోచుటయం దాశ్చర్యములేదు. ఆ పాశ్చాత్యులు తదనుయాయులు కల్పించిన దుస్తర్కగర్తము నుండి వేదవాణిని వేదములయొక్క బలముతోడనే సముద్ధరించుటకు విద్వన్మూర్ధన్యులైన శ్రీహరి సోదరులు కొన్ని దశాబ్దములు సాగించిన సారస్వత తపముయొక్క పంట యీ భారతీనిరుక్తి. వారు తమ యీ గ్రంథమునందు-వేదరాశి తన నుద్దేశించి చేయఁబడు దుర్వ్యాఖ్యానములగూర్చి తానే యేమనుచున్నదన్న విషయమును నిరూ

పించుచు - వేదములను దుష్టతర్కాఘాతములనుండి పరిరక్షించుట కభేద్య కవచముగా వేదమునే వినియోగించినారు. ఇచ్చట వేదమునకుఁ గవచము వేదమే. వేదమే శత్రుశిరః కర్తనదక్షమైన ఖడ్గము. వేదమే స్వీయ సంరక్షణోద్యోగ శీలియైన ఋషి. ఈ విధముగా ఈ భారతీనిరుక్తి, గాధేయబల సమాక్రాంతయై ఆత్మరక్షణకై స్వశరీరమునుండియే వివిధాయుధములతోడి వీరులను సృజించిన వశిష్ఠుని శబళ.

అందుచేతనే శ్రీశ్రీశ్రీ పరమహంస పరివ్రాజకాచార్య వర్యులు, శ్రీ కాంచీ కామకోటి పీఠాధీశ్వరులు నగు శ్రీ జగద్గురు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీస్వామి వారు శ్రీ హరిసోదరుల యీ గ్రంథము నత్యంతాసక్తితో విని మెచ్చుకొని వీరి యీ గ్రంథమును సర్వాంగ సుందరముగా మీ మండలియం దచ్చొత్తింపుడనుచు ఆశీః పురస్సరముగా నన్నాదేశించిరి. గ్రంథము ముద్రితమైనది. శ్రీహరి సోదరులు నన్ను వెంటనిడుకొని గ్రంథమును కార్వేటి నగరమునందున్న శ్రీ జగద్గురువులకు సమర్పించిరి. అపుడు స్వామి ముఖమునందానందము, మా శిరస్సులపై (శ్రీహరి సోదరులు, నేను) నాశీర్వాదాక్షతలు, మా అందరి భుజములపై కాశ్మీరు శాలువలు యౌపపద్య విస్మృతిని ఘటించినవి. శ్రీ స్వామివారి యామోదానుసారము ఈ గ్రంథమునకు పీఠిక రచియించిన సాంగస్వాధ్యాయ భాస్కరులు, బ్ర. శ్రీ కుప్పా లక్ష్మావధానులుగారికిని, కోరినంతనే ఆనందముతో తమ యభిప్రాయముల నొసంగిన పండిత ప్రకాండులకును నా హృదయపూర్వక నమస్కారములు.

ఇట్టి ఈ మహాగ్రంథమును సర్వవిధముల సామాన్యుడనైన నేను ఆర్థికముగా శక్తి ఆవంతయుఁ జాలని మండలియం దచ్చొత్తించుటకు శ్రీ స్వామివారి దివ్యాశిష మెంత కారణమో, శ్రీహరి సోదరులకు నా యందును, మండలియందును గల సహజ సౌహార్ద మంత కారణము. ఒకటి దివ్యమై పాలింపఁగా వేఱొకటి లౌకికమై సాక్షాత్కరించినది. నాకీ భాగ్యము కలిగించిన శ్రీ స్వామివారికి నమస్కరించుచు, వేదమాతయైన యీ భారతీ నిరుక్తికిఁ బ్రణమిల్లుచు, శ్రీహరి సోదరులయెడ వినయ వినమితుఁడ నగుచు, నా జీవితము - మండలి కృషియు చరితార్థ మని భావించుచు, వేదవిద్యా సంప్రదాయజ్ఞమైన విద్వల్లోకమున కీ గ్రంథ మమందానంద సంధాయి కాఁగలదని విశ్వసించుచున్నాను.

తెనాలి
విరోధకృత్
పుష్యము

ఇట్లు
విధేయుఁడు
బులుసు సూర్యప్రకాశశాస్త్రి
వ్యవస్థాపకుఁడు, సాధన గ్రంథమండలి

# వందన సమర్పణము

'నిరుక్తం నామ శబ్దస్య సర్వావయ వార్థానుగమేన ప్రసిద్ధాదర్థా దర్థాన్తరేవృత్తిః' అని పంచపాదికా వివరణమునందలి నిరుక్త లక్షణము. ఇట్టి నిరుక్తమే "నిరుక్తి ర్యోగతో నామ్నా మన్యార్థత్వ ప్రకల్పనమ్"—అనెడి నిరుక్త్యలంకారమై సాహితీ లోకమున విలసిల్లుచున్నది. వైదిక శబ్దార్థ తత్త్వమును దర్శించుటకై ముప్పది యేండ్లకు పైబడిన మా పరిశోధనలోని కొంత భాగ మిపుడు భారతీనిరుక్తి యను పేర ప్రకటితమైనది. మా యీ నిరుక్తి రూపమగు తొలి కుసుమము వేద వేద్య—శ్రీ వేణుగోపాల దేవపదముల కలంకారమై వెలయుట మా భాగ్యము. మా కుల దైవము శ్రీ వేణుగోపాలుడు తన దివ్యపదముల కిట్టి యలంకారముల గూర్చెడి భాగ్యమును మాకు నిరంతరము ప్రసాదించుగాక. "కస్మైచి దస్మై నమః"

ఏ ప్రాచీన భారతీయ వాఙ్మయము మా యీ రచన కాలంబనమై నిలిచి వెలుగుబాటల జూపినచో ఆ వాఙ్మయ ప్రవర్తకులగు యాస్క శౌనక వ్యాస వాల్మీకాది మహర్షులకును, శబర శంకరాది దర్శనకారులకును, సాయణ మహీధరాది భాష్య కర్తలకును, కాళిదాసాది మహాకవులకును మేమెంతయో ఋణపడియున్నాము. "తేభ్యో నమస్కుర్మహే"

ముద్రితమైన మా యీ గ్రంథమును మరల గూడ మూడు రోజులపాటు సావధానముగ విని, "మీ అభిమాన కోశము కరిగిలు గాతి" – "వెంటనే హిందీ ఆంగ్లభాషలలోనికి అనువాదము జరుగవలెను"—అనుచు ఆశీర్వదించి యను గ్రహించిన జగద్గురువులు శ్రీ కాంచీ కామకోటి పీఠాధిపతులు మా హృదయసీమల నెల్లెడ నధివసించి తను యాశీస్సులచే తనుపుచుందురు గాక – 'వందేమహి చ తాం దేవీం కామకోటి సదస్థితిమ్"

1947 వ వత్సరముననే మా యీ పరిశోధనను గాంచి తమ యభిప్రాయ ముల నొసగుటయే గాక గ్రంథ మెపుడు ముద్రితమై రూపుదాల్చునా యని ప్రతీ క్షించుచు నడుగడుగున వాత్సల్యము మీఱ ప్రోత్సహించిన శతావధానులు, కీ. శే. శ్రీ కాశీ కృష్ణాచార్యులు, శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారును, పండిత ప్రకాండులు, టి. ఎ. వేంకటేశ్వర దీక్షితార్ మహాశయులును మాకు చిర స్మరణీయులు. "నమో మహద్భ్యః కవి పండితేభ్యః"

జగద్గురువులు శ్రీ కాంచీ కామకోటి పీఠాధిపతుల యామోదమును బొంది, మా యభ్యర్థనమును మన్నించి, మా యీ గ్రంథమును ప్రత్యక్షర పరిశీలనము గావించి, యమూల్యము విపులమునగు పీఠికను గూర్చిన సాంగ స్వాధ్యాయ భాస్కరులు శ్రీ కుప్పా లక్ష్మావధానులు గారికిని, బహుకార్య వ్యాపృతులయ్యు నత్యన్నాసక్తితో మా యీ గ్రంథము నామూలాగ్రముగ సాదరముగ సవిమర్శముగ విని యానందించుటయే గాక ద్విగుణీకృతోత్సాహులై పాఠక లోకమునకీ గ్రంథమును పరిచయము చేసిన కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథులకును, సాదరముగ మా యీ గ్రంథమును బరిశీలించి యమూల్యములగు తమ యభిప్రాయముల నొసగిన పండిత వర్యులు శ్రీ ఉప్పుటూరి గణపతిశాస్త్రిగారికిని, శ్రీ రేమిల్ల సూర్యప్రకాశ శాస్త్రిగారికిని, శ్రీ కుప్పా శ్రీఆంజనేయ శాస్త్రిగారికిని, శ్రీ వీరేశ్వరకృష్ణ దోంగరే శాస్త్రిగారికిని, శ్రీ సన్నిధానం లక్ష్మీనారాయణమూర్తి గారికిని, శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి గారికిని, శ్రీ జటావల్లభుల పురుషోత్తము గారికిని, శ్రీ వేటూరి సుబ్బారావుగారికిని, శ్రీ దివాకర్ల వేంకటావధానిగారికిని, శ్రీ పేరి సూర్యనారాయణ శాస్త్రిగారికిని మఱియు గ్రంథరచనా విషయమున తగు సూచన లిచ్చి యుత్తేజపఱచి, యమూల్యమగు తమ యభిప్రాయము నొసగిన విద్వద్వర్యులు శ్రీ సూరి రామకోటి శాస్త్రిగారికిని—మే మెంతయు కృతజ్ఞులము. 'నమాంసి సద్భ్యో వి భూషణేభ్యః'

మాలో నొకరుగ మెలగుచు, రచనను ప్రోత్సహించుచు, వ్రాతప్రతుల రాత్రింబవలు పరిశీలించుచు ముద్రణకు యోగ్యముగ గ్రంథమును సిద్ధపఱచుటలో నెంతయో తోడ్పడుటయే గాక శ్రీవారి యాశయానుగుణముగ నీ గ్రంథమును హిందీలోని కనువదించుటకు నుత్సాహముతో బూనుకొనిన ప్రియమిత్రులు పండితులు శ్రీ జనస్వామి సుబ్రహ్మణ్య శాస్త్రిగారును, ఈ గ్రంథ పరిశోధకులును, ప్రాచీన సంప్రదాయ రహస్యముల నుద్ఘాటించు గ్రంథముల వెలువరించుచు వాఙ్మయసేవ నొనర్చుచున్న సాధనగ్రంథమండలి (తెనాలి) వ్యవస్థాపకులునైన శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రిగారును, ఈ గ్రంథమును సర్వాంగసుందరముగ ముద్రించుటలో మిగుల సహకరించిన ఎ. యస్. ఆర్. పవర్ ప్రెస్ (తెనాలి) యజమానులు శ్రీ ఎ. రామకృష్ణారావుగారును మాకెంతయు నభినందనీయులు. 'నమః సఖిభ్యః సఖిపితృభ్యః'

ఎంత శ్రద్ధగ జూచినను ప్రమాదవశమున నచటచట దొఱలి యుండెడి నెఱసులను సహృదయులు మన్నింతురు గాక. 'నమాంసి సద్భ్యః సుసత్త్వశీలేభ్యః'

వేదశ్శాస్త్రాంగ తత్త్వజ్ఞాన్ స్వధర్మ ప్రతిబోధకాన్ ।
సంప్రదాయక్రమసంపన్నాన్ వందంతే హంసోదరాః ॥



ఆంధ్రదేశమునందలి వేదశాస్త్రప్రముఖుల ప్రోత్సాహముచే విజయవాడలో

శ్రీ కాంచీ కామకోటి పీఠమునకు సమర్పింపబడిన

వజ్రహార శ్రీ కామాక్షీ గర్భిత రత్నఖచిత

స్వర్ణమకుటము

శ్రీః

# గురు దేవతా స్తుతిః

ఇదంపురనివాసం శ్రీ వేణుగోపాలవిగ్రహమ్।
పితృపైతామహాధనం నమామ జగతాం గురుమ్॥
చిద్ఘనాయ ప్రసన్నాయ శ్రుత్యాకాశవిహారిణే।
అద్వైతామృతవర్షాయ శంకరాయ నమో నమః॥

కామకోటిమహాపీఠవాసినీం కామితార్థదామ్।
వందేమహి చ తాం దేవీం చంద్రశేఖరసుందరీమ్॥
త్రయీవిద్యాత్మికాం దేవీం కాంచీపురమహాద్యుతిమ్।
నమామ కామకోటిం తాం జయేంద్రవినుతాం ప్రభామ్॥

సోమయాజిగురుం వందే దుర్గాంబాం మాతరం శుభామ్।
యౌ సర్వగుణసంపన్నౌ శివావివ శివాయ నః॥
వేణుగోపాలదేవస్య మందిరం గోపురాదికమ్।
నిర్మాయ సుకృతాత్మానౌ పితరౌ తా వుపాస్మహే॥

పితృవ్యం రామశర్మాణం అగ్రజ స్యానుగామినమ్।
పురాణోపనిషచ్ఛాస్త్ర మననైకరతం సదా॥
రామనామామృతాస్వాదనిరతం ధర్మతత్పరమ్।
మార్గదర్శిన మస్మాకం నమామ శిరసా గురుమ్॥

హనుమచ్ఛాస్త్రిణం వందే వైయాకరణభూషణమ్।
కరుణావంతం కులపతిం సంస్కృతం యస్య జీవితమ్।
కవితార్కికసింహం శ్రీ గోవిందాచార్య మేవ చ।
రంగరామానుజాచార్యం వందే శాస్త్రైకజీవితమ్॥

పితౄన్ దేవాన్ ఋషీన్ దివ్యాన్ గురూన్ శాస్త్రార్థకోవిదాన్।
నమామ విదుషో యేషా మాశిషేయం కృతి స్తతా॥

# అవతారిక

అజముఖాంబుజ నిఃసృత వాహినీ
హరి హృదబ్ధి తరంగ విహారిణీ।
హరశరీర మహాచల వాసినీ
త్రిపథగా త్రిపదా నను భారతీ॥

అంబ! భారతి! నిరుక్తిరంజితే
సూనృతే మధురసూక్తశోభితే।
భావనాంబర విహార విశ్రుతే
పాహి పావని! హరిప్రియే! శివే॥ — వేదమాతృస్తవః.

వేదప్రతిపాద్యయు, వేదమాతయు, వాగ్దేవతయు నగు భారతి యొక్క స్వరూపదర్శనమే భారతీనిరుక్తి.

పరాదేవత యగు నా భారతి యొక్క స్వరూపము (లేక పరమాత్మ స్వరూపము) నుద్బోధించుటకై యవతరించిన వేదవాణి భారతి. పరాదేవత యగు భారతియొక్క స్వరూపమును దెలియవలెనన్నచో వేదవాణి యగు భారతియొక్క స్వరూపము దెలియవలసి యున్నది. అట్టి భారతి (వేదము) యొక్క స్వరూపనిర్వచనమే భారతీనిరుక్తి.

పరాదేవత యగు భారతిని, తత్ప్రతిపాదిక యగు వేదభారతిని పెక్కు తెఱగుల నారాధించెడి ప్రజకును 'భారతీ' యని పేరు. భారతీప్రజ యొక్కయు, భారతీసంస్కృతి యొక్కయు స్వరూపవివరణమే భారతీ నిరుక్తి.

భారతి యొక్క యీ త్రివిధస్వరూపమును శ్రుతి స్మృతీ పురాణేతిహాసాది తాత్పర్యానుగుణముగ వివరించుట యీ భారతీనిరుక్తియొక్క లక్ష్యము.

ఈ భారతీస్వరూపమును శ్రుతులే నిర్వచించినవి; మహర్షులెందఱో దర్శించి ప్రబోధించిరి; భాష్యకర్తలు మున్నుగువా రెందఱో వివరించిరి; అట్టియెడ మరల నీ గ్రంథ మేల ? ఇందు క్రొత్తగ ప్రతిపాదింపబడెడి దేది ? యనవచ్చును. శ్రుతులు చక్కగ ప్రతిపాదించినను వేదముల నిరసించుచు కేవల బుద్ధిప్రమాణముతో బెక్కు దర్శనములు బయలు దేరినవి. వానిని ఖండించి సమన్వయపఱచుటకై పెక్కు శాస్త్రము లవతరించినవి. న్యాయవైశేషికాది శాస్త్రము లట్టివి. ఎంత వాఙ్మయ మున్నను, సిద్ధాంత మెంత స్ఫుటముగ నిరూపింపబడినను వేర్వేఱు కాలములలో వేర్వేఱు ప్రతిపక్షవాదములు చిగురించుచునే యుండును. ఆ వాదముల ఖండించుటకై యెప్పటికప్పుడు క్రొంగ్రొత్త గ్రంథము లవతరించుచునే యుండును. అనాదిసిద్ధమైన సిద్ధాంతమునే నూత్ననూత్న ప్రతిపక్షవాదముల ననుసరించి క్రొంగ్రొత్తరీతుల మఱల మఱల నిరూపించి ప్రబోధింపవలసి యుండును.

ఇటీవల నించుమించుగ నొకటి రెండు శతాబ్దుల నుండి పాశ్చాత్య చరిత్రకారులును, తదనుయాయులును గేవలము చరిత్ర కల్పనాలక్ష్యముతో వేదవాఙ్మయమును బరిశీలించిరి. తమ తమ భాషలలోని కనువదించుకొనిరి. ఆ భాషాంతరీకరణములను, ప్రపంచములోని వివిధభాషల యందు గల కొన్ని పదములతో సంస్కృతభాషా పదములకు గల సామ్యమును, విజ్ఞానక్రమవికాసము (Theory of evolution) అనెడి న్యాయమును, ఖగోళ భూగర్భాది శాస్త్రములను నాధారముగ జేసికొని పెక్కు చరిత్ర కల్పనల గావించిరి. యుగయుగములుగ భారతీయుల దృష్టిలో 'సపౌరు

షేయములు స్వతఃప్రమాణములు' నయి విలసిల్లుచు వచ్చిన వేదములు చరిత్రకారుల ననుసరించి 'ఆర్యు లనెడి పెక్కు తెగల'యొక్క రచనలు ; అవి భాషాసామ్యాది మార్గముల ద్వారా తెలియదగినవి'- యని చెప్పబడినవి. కర్మ-భక్తి-జ్ఞానయోగముల ద్వారా పరతత్త్వము నుద్బోధించుటకై కాండత్రయాత్మకముగ నవతరించినదని చెప్పబడు వేదమంత్రరాశి పాశ్చాత్యుల ననుసరించి యాదిమ నివాసులలోని పలు తెగలయొక్క యంతర్యుద్ధవర్ణనలుగను, వారు ప్రకృతి దృశ్యముల జూచి దేవత లని భ్రమించి సంభ్రమాశ్చర్యపరవశులై చేసిన స్తోత్రములుగను చిత్రింపబడినవి[1]. పరమేశ్వరుని నుండి నిఃశ్వాసముల వలె నప్రయత్నముగ వెలువడి ఋషులచే మహాతపఃసమాధిలో దర్శింపబడినట్లు చెప్పబడెడి వేదమంత్రములు వేర్వేరు కాలములలో, వేర్వేరు విజ్ఞానములతో, వేర్వేరు తెగల రచనలుగా చరిత్రకారు లూహించిరి. సంగ్రహముగ వారి చరిత్రాంశము లివి :

"మానవజాతి యొక్క నాగరికత శైశవావస్థ యందున్న కాలములో నార్యు లనెడివారి తొలి రచన ఋగ్వేదము ; ఇందు పది మండలములు గలవు : వీనిలో దశమ మండల మత్యంత మర్వాచీనము ; ఏలయన, పూర్వమండలములలో గన్పట్టు భక్తిప్రవణము లయిన స్తోత్రములు క్రమముగ తరిగి సృష్టిరహస్యాదుల గూర్చిన యూహాగానములు కొలదిగ నిట పొడసూపసాగినవి ; ఋగ్వేద రచన యయిన కొంతకాలమునకు సామవేదము, తర్వాత యజుర్వేదము రచింపబడినవి ; వేదకాలమున తొలుదొలుత యజ్ఞనిర్వహణమున కెట్టి నిబంధనలు లేవు ; ఎవరికి వారు తమతమ భక్తికొలది యా యా దేవతల నుద్దేశించి నిరాడంబరముగ స్తోత్రము జేయుచు నగ్నియందు హవిస్సుల నొసగెడివారు ; కాలక్రమమున నిబంధనలు పెరిగినవి ; ఆ నిబంధనలే యజుస్సులు ; తరువాత యజ్ఞ

1. Maxmuller – What India can teach us P. P. 108 to 113.

క్రియాకలాపమును బెంచుచు బ్రాహ్మణములు బయలుదేరినవి ; చాలకాలము వరకు అథర్వవేదమునకు వేదత్వమే లేకుండెను ; మఱియు సూర్య చంద్ర విద్యు దగ్ని నక్షత్రాది జ్యోతిస్సులే (Bright Bodies or Luminous Bodies) యార్యుల దృష్టిలో మొదట దేవతలు ; ఈ జ్యోతిస్సులే జగద్యాత్రానిర్వహణమునకు గారణభూతము లని వారు నమ్మిరి ; తరువాత భూమ్యాకాశములు, మేఘములు, వాయువులు, నదీ నద పర్వతాదులు, లతావృక్షాదులు తుదకు పశుపక్ష్యాదులు సైతము దేవతాగణములో జేర్పబడినవి ; చనిపోయినవారు సైతము దేవత లగుదు రని భావించి వారికి శ్రాద్ధాదులు జేయబడినవి. క్రమముగ దేవతలకు గరచరణాద్యంగములు గల్పింపబడినవి ; దేవతాకల్పనము ఋగ్వేదమునందే యెక్కువగా గలదు. మనుజుని మనస్సు అనెడి 'ఫ్యాక్టరీ'యందు రకరకములైన దేవతల నుత్పత్తి జేయు ప్రణాళిక ఋగ్వేదమునందువలె మఱి యే యితరదేశ వాఙ్మయము నందును లేదు ; ఇట్లు దేవతల సంఖ్య మితిమీఱి పెరుగుచుండగా — ఈ భూమ్యాకాశాదుల నిజముగ సృజించిన దెవరు ? — అనెడి ప్రశ్న యార్యులలో గొందఱ కుదయించెను ; అట్టి శక్తిని గొంద ఱగ్నికి సమకూర్చిరి ; మఱికొంద ఱింద్రునకు — నిట్లే సోమ వరుణాది దేవతలకును గల్పింపబడినవి. క్రమముగ దేవతలలో పోటీ యేర్పడెను ; కొంతకాలమునకు — 'దేవు డొకడే ; కవులు ఒకే దేవుని యనేకనామములతో బిలుచుచున్నారు.' — అను భావము బయలుదేరెను. తత్, సత్, ఆత్మా, బ్రహ్మ అదితి, అక్షరమ్ — ఇత్యాది పదములు కొన్ని ఋగ్వేదమున **గూడ** గన్పట్టుచున్నవి ; తరువాత బయలువెడలిన యుపనిషదాది గ్రంథములలో జెప్పబడెడి తత్త్వార్థములు తత్, సత్ మొదలగు నీ పదములకు లేకపోయినను, తత్త్వజిజ్ఞాసకు అంకురములు ఋగ్వేదమున గలవని యంగీకరింపక తప్పదు ; మొత్తముమీద వేదములందు బాహ్యదర్శనమే గాని యంతర్దర్శనము లేదు.

మొదట వేదములలో నిరాడంబరముగ సాగి, పిదప బ్రాహ్మణముల కాలములో బహుళముగ బెఱిగిన యజ్ఞక్రియాకలాపముపై విసుగు జనించినది: అంతర్దర్శనము సాగినది; ఉపనిషద్వాఙ్మయము బయలువెడలినది; అనాదిగ తమ పూర్వుల గౌరవించు స్వభావము భారతీయులకు గలదు; అందుచే నుపనిషత్తులు యజ్ఞములను బూర్తిగ నిషేధింపక వానిని బ్రోత్సహించుచునే యుపాసనలను తత్త్వజిజ్ఞాసను బెంచినవి; ఈ జిజ్ఞాస బౌద్ధజైనాదుల కాలమునను, పిదప శంకరాదుల కాలమునను మఱింత పెఱిగినది; సోమపానము జేసెడి, దేవతలను గొల్చెడి వేదకాలమునాటికిని శంకరుని యద్వైతబ్రహ్మదర్శనమునాటి కాలమునకును విజ్ఞానవికాసవిషయమున నెంతేని వ్యత్యాసము గలదు; ఇట్లే దేవతాస్వరూప దర్శనవిషయమునను క్రమవికాసము గలదు."—అని చారిత్రికుల యూహ.[1]

వేదమును గూర్చిన యిట్టి చరిత్రాంశములు ప్రస్తుత మన్ని విశ్వవిద్యాలయములయందును, పాఠశాలలయందును బాఠ్యాంశములుగ నిర్ణీతములయి, బోధింపబడుచున్నవి. క్రమముగ వానిని బ్రధానముగ నభ్యసించెడి భారతీయ విద్యార్థులకును వేదములకును మధ్య నీ చారిత్రికకల్పన లడ్డుగా నిలిచి, 'వేదములు తమ విజ్ఞానసర్వస్వము'లను విశ్వాసమును సడలించుచున్నవి. దానితో మనకు కాణాచియైన యార్షసంస్కృతియు దూర మగుచున్నది. అందుచే చారిత్రికకల్పనలు వేదవాక్యార్థ నిర్ణయవిషయమై ప్రమాణము లగునా ? కావా ? —యను నంశము ప్రధానముగ బరిశీలింపవలసియున్నది.

వేదరచయిత లనబడెడి యార్యుల నివాసస్థానము, వారి కాలము మున్నగు నంశములపై చారిత్రికుల మధ్య పెక్కు వివాదములు గలవు

---

1. 1. S. Radhakrishnan, Indian Philosophy, Vol. I.
   2. A. A. Macdonell—History of Sanskrit Literature.
   3. Maxmuller—History of Vedic Literature.

